# సారె బందుపెట్టం

కనకయ్య

మేం గరీబోళ్ళమే
కూలి నాలి చేస్కోని బతికెటోల్లమే
గరీబోల్లెగద సారతాగుతరు
రెక్కలు ముక్కలైనోల్లెగద
యింత కల్లువొట్టు తాగి నిశాలనీల్గుతరు
మేం దినాం కూలి చేసుకుంటం
కొమ్ము బొక్కిరగంగ రిక్ష దొక్కుతం
ఛాతీల రక్తం పేరుకుపోంగ యెత్తుగడ్డ లెక్కుస్తం
పారపని చేస్తం-హమాలి పనిజేస్తం
మీ బూముల్ని బంగారం జేస్తం
మీరుండెతందుకు పెద్ద పెద్ద బవంతులు కడ్తం
మీ డ్రైనేజి కారుతుంటె
మా ఎత్తు మోరీలల్ల ముక్కులు పలిగిపోంగ దిగుతం—
యే పనిజేసిన మాపెయి దాసుకోలేదు
మీకే సేవలు జేసిన మా నెత్తురు కాపాడుకోలేదు
మేం గరీబోల్లమే

యెంత కష్టపడ్డ మా కడుపెన్నడు నిండలే
యెంత అలిసిపోయిన యొల్లకింత కూడెన్నడు దొరకలే
రోజంతా బాయి నీల్లతోటి
లేకుంటె మంచి నీళ్ళతోటి దొక్క నింపుకుంటం
పొద్దుగూకుతుంటె పెయ్యంత పచ్చి పుండయితది
పేగులల్ల కేమి లేక గావురై బేజారైతది
యింత సారవొట్టు నోట్ల పోసుకుంటె
కడుపుల నిప్పులు జల్లినట్టై సల్లబడతది
పెయ్యంత మొద్దుబారి ఆయిమంటది
మేం గరీబోల్లం
మీకు సాకిరి చేసిన సేతుల్నిండ
పొక్కలొస్తె మంట సల్లారెతందుకు తాగుతం—
మా కూలి పైసల్తోటి

( మిగతా 3వ కవరు పేజీలో )

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక


సంపుటి : 16 సంచిక : 2

నవంబర్ 1992



రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

---

**మేనేజర్, ప్రజాసాహితి,**
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

---

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :

**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.





ముఖ చిత్రం :

ప్రపంచాన్నే
కుదిపేసిన
పది రోజుల్లో
మహో నాయకుని
మహోద్వేగ ప్రకటన
"అధికారాలన్నీ
సోవియట్ల కే!"

నాలుగవ కవరు పేజీ

వింటర్ ప్యాలెస్‌పై
దాడికి పథకం రచనలో
లెనిన్ స్టాలిన్‌లు


వెల : రూ. 5 సం॥ చందా రూ. 50

ప్రత్యేక సం॥ చందా రు. 100

ఈ సంచికలో ...




Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.), at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.

Working Editorr : NIRMALANANDA

# సంపాదకీయం

## 'సారా'జకీయం

సారా వ్యతిరేక పోరాటాన్ని రాజకీయం చేయవద్దని అనేక మంది పెద్దలు నీతి బోధ చేస్తున్నారు. 1790 లో బ్రిటీషు దొరలు భారతీయుల తాగుడు అల వాటుని ఆదాయ వనరుగా భావించిన దగ్గర నుండీ ఈనాటి దాకా అది రాజకీయంతో పెనవేసుకునే వున్నది. రాజ్యం (స్టేట్) తానే తాగుడుని క్రమబద్ధీకరించే సాకుతో దోపిడీ వర్గాల పనిముట్టుగా వ్యవహరించటం వెనక రాజకీయం లేదా? ఆదాయవనరు నుండి అణచివేత రూపం దాకా దాన్ని మార్చుకోవటం రాజకీయంలో భాగమే! రాజ కీయాధికార సాధనకి సారాని పారించే వాళ్ళు నీతి బోధలతోనే బుద్ధిమంతులైపోతారు!

దురలవాటుగానూ, సాంఘిక, సాంస్కృతిక సమస్య స్థాయిలోనే ఉండవలసిన మద్యపానం, ఆర్థిక, రాజకీయ దోపిడీ రూపాన్ని సంతరించుకుంది, కనుకనే దానికి వ్యతిరేకంగా జరిగే ఆందోళనను వర్గ పోరాటంగా, రాజకీయోద్యమంగా సాగు తున్నదీ.

సారా సమస్యని రాజకీయం చేయొద్దని బోధించే వారిది అవగాహన లోపమైనా అయి వుండాలి. కాకుంటే పాము తల మీద దెబ్బ పడనివ్వకూడదనే ఆలోచనన్నా కావాలి.

మహిళా ఉద్యమాలు వేస్తున్న కొన్ని ప్రశ్నలకు ఈనాటి సారా వ్యతిరేక పోరాటంలో జవాబులు దొరుకుతాయి. పితృ స్వామిక వ్యవస్థ పురుషులకు అడ్డూ అదుపూ లేని స్వేచ్ఛ నిచ్చింది. బాధ్యతా రహితంగా వచ్చిన ఆదాయాన్నంతా తన విలాసాలకూ, సరదాలకూ, తాగుడుకి తగలేసినా, వ్యవస్థ దాన్ని అదుపు చేయక పోగా, యింకా యింకా ప్రోత్సహిస్తోంది. అందుకనే కుటుంబ జీవనాన్ని ఛిన్నా భిన్నం చేస్తున్న సారా మహమ్మారిపై మహిళలు పోరాటాన్ని ఎక్కుపెట్టారు. కుటుంబ బాధ్యతంతా స్త్రీలదే కాదు; పురుషులకు కూడా సగం వుండాలనే ప్రజా స్వామ్య జీవనాన్ని అమలులోకి తెచ్చుకునే ఆకాంక్ష ఈ పోరాటంలో అంతర్లీనమై వుంది!

మహిళలు సామూహికంగా ఆందోళనకి దిగటానికి ముందు, వ్యక్తిగత స్థాయిలో పురుషులతో అనేక పోరాటాలు చేశారు. కన్నీళ్ళు పెట్టుకున్నారు. బతిమిలాడారు, అలిగారు, బెట్టు చేశారు, తిట్టారు, అరిచారు. ఏ కొద్ది మంది మీదో తప్ప అవి పనిచేయలేదు.

పురుషులు తాగగా లేనిది, స్త్రీలు కూడా తాగితే తప్పేమిటి? అని మహిళలు భావించలేదు. వ్యక్తిగత స్థాయిలో నచ్చచెబితేనో, తోచిన పద్ధతుల్లో ఘర్షణ పడితేనో అది పరిష్కారం కావటంలేదు. తాగుబోతు మొగుళ్ళనీ, కుటుంబాన్నీ, వదిలేసి పోతే....? అది సామూహికంగా సాధ్యపడే విషయం కాదు. తమ తమ అనుభవాల నుంచి క్రోడీకరించుకొని, సారా అందుబాటులో లేకుండా చెయ్యటమే పరిష్కార మార్గంగా వారు యెంచుకున్నారు.

సారా మాయల మరాఠీ ప్రాణం ఏ చిలుకలో వుంది ? అదెక్కడ దాగుంది ? రాజకీయాధికార పీఠాలతో, వ్యవస్థతో పెనవేసుకుని కూర్చుందని గ్రహించటం కష్టమేమీ కాదు. అందుకే యింటిలో నుండి పోరాటం బజారులో కొచ్చింది. సారా వేలం పాటలు నిలిపి వెయ్యాలనీ, గ్రామాల్లోకి సారాని రానివ్వమనే రూపాన్ని తీసుకుంది.

పితృస్వామిక వ్యవస్థ బంధనాల్లోని ఒక నూలుపోగు - సారా - యొక్క మూలం దోపిడీ ఆర్థిక, రాజకీయ వ్యవస్థలో వుందని ఉద్యమం స్వయంగా నేర్పుతోంది. వాటితో తలబడకుండా మౌలికమైన మార్పు అసాధ్యమని అర్థమవుతోంది.

'సారా నిషేధించాలి' అనే నినాదాన్ని తెలిసో, తెలియకో అనేకమంది ఇస్తున్నారు. కానీ దానిలో స్పష్టత వుండటం లేదు. సారా ఉత్పత్తినా. వ్యాపారాన్నా లేక తాగుడునా నిషేధించ మనేది ? ఏది జరిగినా తమ కోర్కె నెరవేరినట్టుగా భావించటానికనువుగా ఈ డిమాండ్ వుంది. పైకి మద్యపానాన్ని నిషేధించి లోపాయకారీగా దొంగ సారా పారించి, తమ పబ్బం గడుపుకునే తెలివితేటలు మన పరిపాలకులకి బాగానే వున్నాయి. కనుక ప్రజలు తాగటానికి సారా అందుబాటులో లేకుండా చేయవలసిన బాధ్యత ప్రభుత్వంపైనే పెట్టాలి. అందుకే సారా వ్యాపారాన్ని రద్దు చేయమని డిమాండ్ చేయాలి.

ఇటీవలి కాలంలో ఇంత విస్తృతమైన ప్రజానుకూల ఉద్యమం రాలేదు. దీనితో బెంబేలెత్తుతున్న పరిపాలకులు దీన్ని అణచివేయాలని అనేక రకాల కుట్రలు పన్నుతున్నారు.

తెలంగాణాలో ఏ న్యాయమైన సమస్యపై ప్రజలు కదిలినా నక్సలైట్ల పేరుతో క్రూరంగా అణచి పారెయ్యటం, పౌర హక్కులను హరించటం తన విధానంగా ప్రభుత్వం కొనసాగిస్తోంది. మీటింగులకీ, ఊరేగింపులకీ అనుమతులివ్వక పోవటం, యిచ్చినా అనేక యిబ్బందులకు గురి చెయ్యటం సర్వ సాధారణ మయింది. మహిళా ఉద్యమ కార్యకర్తల్ని రాక్షసంగా అవమానించటం, అమానుషంగా హింసించటం పరిపాటయిపోయింది. పత్రికలూ, మేధావులూ, రచయితలూ, కళాకారులూ వీటి పట్ల ఇంకా తీవ్రంగా స్పందించటం అవసరం.

( తరువాయి 8వ పేజీలో )

అక్టోబర్ (నవంబర్) విప్లవం సందర్భంగా :

# ఎజెన్ పోత్యే 25వ వర్ధంతి

ప్రచురణ : ప్రావ్డ నం. 2, 3-1-1913

రచన : వి. ఐ. లెనిన్

'అంతర్జాతీయ గీతం' ("ఆకలి మంటచె మలమలలాడే....) అనే ప్రఖ్యాత కార్మికవర్గ గీతం రచయిత అయిన ఫ్రెంచి కార్మిక కవి ఎజెన్ పోత్యే మరణించి గత సంవత్సరం - 1912 నవంబర్ నాటికి 25 యేండ్లయింది.

ఈ గీతం అన్ని యూరోపియన్, తదితర భాషల్లోకి అనువదింపబడింది. వర్గ చైతన్యం గల ఒక కార్మికుడు ఏ దేశం వెళ్ళినా, విధి అతన్ని యెక్కడ పడ వేసినా, స్వదేశానికి దూరంగా, భాష రాక, మిత్రులు లేక, పరాయివాడిననే భావం అతన్ని యెంతగా పీడించినా- 'అంతర్జాతీయ గీతం' యొక్క సుపరిచితమైన బాణీ ద్వారా అతనికి కామ్రేడ్లూ, మిత్రులూ లభించగలరు.

సకల దేశాల కార్మికులూ తమ యోధాగ్రేసరుడైన ఈ కార్మికవర్గ కవి పాటను స్వీకరించి, కార్మిక వర్గపు ప్రపంచ వ్యాప్త గీతంగా చేశారు.

ఆ విధంగా, అన్ని దేశాల కార్మికులూ యిప్పుడు ఎజెన్ పోత్యే స్మృతిని గౌర విస్తున్నారు. ఆయన భార్యా, కూతురూ యింకా జీవించి వున్నారు. 'అంతర్జాతీయ గీతం' రచయిత తన జీవితమంతా బతికినట్టే, దారిద్ర్యంలో బతుకుతున్నారు. ఆయన 1816 అక్టోబర్ 4న, పారిస్‌లో జన్మించారు. తన మొదటి పాట రచించినప్పుడు ఆయన వయస్సు 14. దాని పేరు 'స్వాతంత్ర్యం వర్ధిల్లు గాక!' 1848లో ఆయన బూర్జువా వర్గం మీద జరిగిన కార్మికుల మహాయుద్ధంలో మార్గావరోధాల వద్ద నిలిచి పోరాడిన యోధుడు.

పోత్యే బీద కుటుంబంలో పుట్టి, జీవితమంతా బీదవాడుగానే వున్నారు. మొదట బంగీలు కట్టేవాడుగానూ, తరువాత బట్టల మీద నమూనాలు గీసేవాడుగానూ పొట్ట పోసుకుంటూ బతికారు.

1840 నుండి ఆయన ఫ్రాన్సు జీవితపు గొప్ప ఘటనల కన్నిటికీ సమరశీల గేయాలతో ప్రతిస్పందించి, వెనకబడిన వాళ్ళ చైతన్యాన్ని మేల్కొల్పేరు. 'కార్మికులను ఏకం కం'డని ఉద్బోధించారు. ఫ్రెంచి బూర్జువా వర్గాన్నీ, బూర్జువా ప్రభుత్వాలనూ ఆయన అభిశంసించారు.

మహత్తరమైన పారిస్ కమ్యూన్ (1871) రోజుల్లో పోత్యే కమ్యూన్‌లో ఒక సభ్యుడిగా ఎన్నికయ్యారు. పడిన 3,600 వోట్లలో ఆయనకు 3,352 వచ్చాయి. మొదటి కార్మికవర్గ ప్రభుత్వమైన కమ్యూన్ యొక్క కార్యకలాపాలన్నిటిలోనూ ఆయన పాల్గొన్నారు.

కమ్యూన్ పతనంతో పోత్యే మొదట ఇంగ్లాండుకూ, తరువాత అమెరికాకు పారిపోవలసి వచ్చింది. ప్రఖ్యాత 'అంతర్జాతీయ గీతం' 1871 జూన్‌లో రచించబడింది. మే లో రక్తపుజేరుల్లో కమ్యూన్ ఓడిపోయిన మరుదినం అనవచ్చు.

కమ్యూన్ అణచివేయబడింది. కానీ పోత్యే 'అంతర్జాతీయ గీతం' తన ఖావాలను ప్రపంచమంతా వ్యాప్తి చేసింది, ఇప్పుడది మునుపటి కంటె సజీవంగా వుంది.

1876లో, ప్రవాసంలో, పోత్యే ఒక గేయం రాసారు. దాని పేరు "అమెరికా శ్రామికులకు ఫ్రెంచి శ్రామికులు చెప్పే విషయాలు", దానిలో ఆయన పెట్టుబడిదారీ పీడనలో కార్మికుల జీవితాన్ని, వాళ్ళ దారిద్ర్యాన్ని, వాళ్ళ యెముకలు విరిచేశ్రమనూ వాళ్ళ దోపిడీనీ, భవిష్యత్తులో తమ ఆశయం జయిస్తుందని వాళ్ళకున్న దృఢమైన విశ్వాసాన్ని వర్ణించారు.

కమ్యూన్ తర్వాత తొమ్మిదేండ్లకు మాత్రమే పోత్యే ఫ్రాన్సుకు తిరిగి వచ్చి వెంటనే కార్మికుల పార్టీతో చేరారు. ఆయన మొదటి కావ్య సంపుటి 1884లో ప్రచురించబడింది. 'విప్లవ గేయాలు' అనే రెండవ సంపుటి 1877లో వెలువడింది.

ఈ కార్మిక కవి రచించిన పలు ఇతర గేయాలు ఆయన మరణానంతరం ప్రచురింపబడ్డాయి.

1887 నవంబర్ 8న పారిస్ కార్మికులు ఎజెన్ పోత్యే మృతదేహాన్ని మరణ శిక్షకు గురైన కమ్యూనార్డుల దేహాలు సమాధి చేయబడిన పేర్‌ల షేజ్ స్మశానానికి తీసుకుపోయారు. ఊరేగింపును లాక్కోడానికి పోలీసులు జనంమీద కిరాతకంగా దాడి చేశారు. అంత్యక్రియలలో చాలా మంది జనం పాల్గొన్నారు. 'పోత్యే వర్ధిల్లాలి!' అనే నినాదాలు అన్ని వైపులా ప్రతిధ్వనించాయి.

పోత్యే దారిద్ర్యంలో మరణించారు. కానీ మానవుల హస్త కౌశలం నిర్మించిన దానికంటే నిజంగా చిరస్థాయి అయిన స్మారక చిహ్నాన్ని ఆయన వదలివెళ్ళారు. పాట ద్వారా ప్రచారం చేసిన మహనీయులలో ఆయన ఒకరు. ఆయన తన మొదటి పాట రాసేటప్పుడు కార్మిక సోషలిస్టుల సంఖ్య మహా అయితే పదులలో వుండింది. ఈనాడు ఎజెన్ పోత్యే చారిత్రాత్మకమైన కోట్లమంది కార్మికులకు తెలుసు....

# మూసా జలీల్
# (1906 - 1944)

మూసాజలీల్‌గా ప్రసిద్ధుడయిన మూసా ముస్తఫెవిచ్ జలిలోవ్ యువ కమ్యూనిస్టు లీగ్ తాతార్-బష్కిర్ బ్యూరో కేంద్రకమిటీలో పనిచేస్తూ 'బుల్లి కామ్రేడ్స్', 'అక్టోబరు పిల్లలు', బాలల పత్రికలకి, సంపాదకులు. తాతార్ రాష్ట్రీ ఒపేరా, బ్యాలెట్ థియేటరు స్థాపనలో చురుకుగా పాల్గొనడమే గాకుండా ఆ థియేటరులో ప్రదర్శించేందుకు రెండు ఒపేరాలు రాసి యిచ్చారు. ఎన్నో కవితా సంకలనాలు వెలువరించారు.

రష్యాలో దేశభక్తియుత మహా యుద్ధం బద్ధలయినపుడు జలీల్ తాతార్ రచయితల యూనియన్‌కి నాయకత్వం వహించారు.

జూన్ 1942 లో యుద్ధం ప్రారంభమయిన తొలిరోజునే మూసా జలీల్ సైన్యంలో చేరారు. యుద్ధరంగంలో తీవ్రంగా గాయపడి, నాజీలకు యుద్ధ ఖైదీగా పట్టుబడ్డాడు. కాన్‌సెంట్రేషన్ క్యాంపులోనయితం చురుకుగా రాజకీయ కార్యక్రమాలు చేయడం కనుగొని, నాజీలు ఆయన్ని క్రూరత్వానికి పేరు పొందిన మోబిట్ జైలులో పడవేశారు. ఈ జైలులో నాజీ ముష్కరులు, చిత్రహింసలు పెట్టినా మొక్కవోని ధైర్యంతో వాటిని ఎదుర్కోడమే గాక, ఎన్నో కవితలు రాశారు. కవి జలీల్‌ని 1944లో ఉరితీసేశారు. జైలు సహచరుడు ఓ బల్గేరియా ఫాసిస్టు వ్యతిరేక కార్యకర్త భద్రపరచడం వల్ల జలీల్ రాసుకున్న రెండు కవితల నోటు పుస్తకాలు సాహితీ ప్రపంచానికి లభించాయి. ఆ కవితలు ఎన్నో ప్రపంచ భాషల్లోకి తర్జుమా అయ్యాయి. మరణానంతరం మూసా జలీల్‌కి 'సోవియట్ వీరుడు' అనే బిరుదు యిచ్చింది నాటి రష్యా.

— సం॥

## చే రుమాలు

విడిపోతూ నా హృదయ ప్రేయసి
చిరు కానుకగా ఓ చే రుమాలుని నా చేతిలో నొక్కింది
ఇప్పుడు—
స్రవిస్తున్న జ్వలించే రక్తాన్ని ఆపేందుకు
నా చిట్లిన గాయంకేసి ఒత్తుకున్నాను.
ఆమె ఇచ్చిన ఈ చిన్న వీడ్కోలు కానుక
ఇప్పుడు—

ఎర్రగా, నులి వెచ్చగా పూర్తిగా తడిసి పోయింది.
దానిలో నిక్షిప్తమైన ప్రగాఢ ప్రేమ
రక్తాన్ని తుడిచేసి
కుళ్ళగించే బాధ నుంచి ఉపశమింప చేసింది.

మన సుఖశాంతుల కోసం
మరణానికి తెగించి
ఎన్నడూ వెన్ను చూపకుండా, శత్రువుని ఎదుర్కొన్నాను.

నా రక్తం ఆ రుమాలుకి
ఎన్నోమరకలు చేసినప్పటికీ
ఇప్పటికీ ఎప్పుడూ నేను
దాన్ని అగౌరవ పరచలేదు !

రచనా కాలం : జూలై 1942 (అనువాదం : భూమి)

---

( 4వ పేజీ తరువాయి )

స్వంత సైన్యాలు కలిగిన రాయలసీమ దొరలు సారా ఉద్యమాన్ని, తమ పెత్తనాన్ని ప్రశ్నించేదిగా భావించి, గ్రామీణులమీదా, మహిళా కార్యకర్తలమీదా దాడులు చేస్తున్నారు. స్వంత రాజ్యాధిపతుల్లా వ్యవహరిస్తున్నారు. ఫ్యూడల్ పెత్తనమూ, సారా వ్యాపారమూ, రాజకీయాధికారమూ, ప్రైవేట్ సైన్యాలూ, పోలీసు అధికార యంత్రాంగమూ కలగలిసిన స్థితిని రాయలసీమలో ముఖ్యంగా ముఖ్యమంత్రి స్వంత జిల్లా కర్నూలులో చూడవచ్చు. స్వేచ్ఛా, స్వాతంత్రాల పట్ల పీసమెత్తు గౌరవమున్న మానవతావాదు లెవరైనా సరే పై దుస్థితిని ఖండించి తీరాలి.

కోస్తా జిల్లాల్లో ప్రజల చొరవని నీరసపరిచే ఎత్తుగడలతో గందరగోళాన్నీ, అస్పష్టతనీ పెంచి పోషిస్తున్నారు. పోరాటానికి నాయకత్వం రూపొందకుండా జాగ్రత్త పడుతున్నారు. అవకాశవాద రాజకీయ విధానాన్ని యిందుకు బాగా వాడుకుంటున్నారు. కోల్పోయిన అధికార పీఠాన్ని తిరిగి అధిరోహించటానికి దీన్నొక సాధనంగా కొందరు స్వీకరించారు.

గత రెండు నెలలుగా సాగుతున్న ఉద్యమం ప్రజలలో- ముఖ్యంగా మహిళలలో సారా వ్యతిరేక స్పృహని బాగా కలిగించింది. అది చైతన్యం స్థాయికి అభివృద్ధయి సంఘటితం కావాలి. గ్రామ, ప్రాంతీయ స్థాయుల్లో 'సారా వ్యతిరేక ప్రజా పోరాట కమిటీలు' రూపొంది సారాని రానివ్వకుండా నిరోధించాలి. అందుకు అడ్డు నిలిచే స్వార్థపర శక్తుల ఆటలు కట్టించాలి. మొత్తంగా దోపిడీ వ్యవస్థను అంతం చేయవలసిన విప్లవ పోరాటాలకిది ఆలంబన కావాలి.



# కరపత్రాల బాంబులను నిషేధించిన బ్రిటీషు ప్రభుత్వం

—కొత్తపల్లి రవిబాబు

1898లో బ్రిటీషు ప్రభుత్వం చేసిన ఒక శాసనం (సెక్షన్ 124 ఎ. Act IV) దృశ్య, సాహిత్య కళారూపాలపై ఆంక్షలు విధించింది. దీని ప్రకారం "మౌఖికంగా గానీ, వ్రాతపూర్వకంగా గానీ, దృశ్యరూపంలోగానీ, ఇతర రూపాల ద్వారాగానీ మహా ఘనతవహించిన రాణీగారికి వ్యతిరేకంగా లేక బ్రిటిష్ ఇండియాలో చట్టబద్ధంగా స్థాపించబడిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలలో ద్వేషభావాలను రెచ్చగొట్టేవారు శిక్షింపబడుదురు. "ఈచట్టం దేశద్రోహ సాహిత్యమని పిలువబడే దాన్ని నిషేధించడానికి అనువుగా చేసుకున్నారు.

ప్రజా రాజకీయాలనూ, నూతన రాజకీయ భావజాలాన్ని ప్రచారం చేయడం ద్వారా ప్రజలను చైతన్యపరుస్తున్న, నూతనభావాలకు ప్రధాన వాహకంగా వున్న, భారతీయ సాహిత్యం వికసించడం గమనించి, బ్రిటీషుప్రభుత్వం దానికి ప్రతిస్పందనను ఇలా చూపింది. ఈ విషయమై 1905వ సంవత్సరం ఒక మైలు రాయిలాంటిది. అప్పటికి వందలాది ప్రింటింగ్‌ప్రెస్సులు, రాజకీయాలపై కరపత్రాలనూ, పుస్తకాలనూ ప్రచురించడం ప్రారంభించాయి. పైచట్టం 1931 నుంచి అమలులోకివచ్చింది.

ఈకాలంలో కాంగ్రెసు, ఇతర రాజకీయ గ్రూపులూ ప్రచురించిన అధికార బులెటిన్లనే కాక, ఇతర గ్రూపుల చేత, వందలాది కరపత్రాలు ప్రచురించబడ్డాయి. ఈ ప్రాంతీయ పత్రికల్లో జాతీయభావాలను ప్రచారంచేస్తూ కవితలూ, కథలూ విరివిగా వచ్చాయి. జానపద, పురాణ గాథలను ఎక్కువగా ఉపయోగించుకున్నారు. ఉదాహరణకు 1931 అక్టోబర్‌లో మదరాసు వార్తాపత్రిక "స్వతంత్రన్"లో ప్రచురించిన 'అయుధపూజ' అనే వ్యాసం ఇలా సాగుతుంది:

"ఈరోజు ఒక విశిష్టమైనరోజు. నవరాత్రి ఉత్సవాన్ని జరుపుకుంటున్నాం. అయుధాలకు పట్టినతుప్పు వదిలించివేశాం. ఆయుధాలకు సరికొత్తగా పదునుపెట్టాం. మనలోని వీరత్వాన్ని పరీక్షించుకున్నాం. ఇక తర్వాతేమిటి? ఇక ఇప్పుడు మన బాహుబలాన్నీ ఆయుధశక్తినీ ప్రదర్శించాలి....

ఈ పద్ధతిలోవుండే చిన్నచిన్న కరపత్రాలు వందలాదిగా నిషేధింపబడ్డాయి. ఈ కరపత్రాలప్రభావం అపారంగా వుండేది. వీటిని చదివేవారూ ఎక్కువగా వుండే

వారు. ఇవి బ్రిటీషుపరిపాలకుల పిరాన్ని వణికించేవి. వీటిలో భాష తేలిగ్గా వుండేది- ప్రజలకు అలవాటైన జాతీయాలతో నిండివుండేవి. బ్రిటీష్ పరిపాలనకు వ్యతిరేకంగా పోరాడమని విజ్ఞప్తిచేసేవి. ఇవి బ్రిటీషవారికి వ్యతిరేకంగా ప్రతిభావంతమైన ఆయుధాలుగా పని చేశాయి. ఐతే వీటిలో కొన్నిపూర్తిగా లౌకిక స్వభావం కలిగిలేవు. నిషేధింపబడిన ఈ సాహిత్యంలో బ్రిటీష్ వ్యతిరేకతతోపాటు మతభావజాలం కూడా వుండేది.

దీనికి మంచి ఉదాహరణ-హర్‌ఫూల్‌సింగ్ జాట్ అనే ఒక కాల్పనికపాత్ర. అతనుచేసే సాహసకృత్యాలను వర్ణించే కరపత్రాలు, అతసు పోలీసుఅధికార్లతోనూ, క్రూరులైన ముస్లిములతోనూ చేసిన ఎదురు దాడుల గురించి ఎన్నో కథలు ప్రచారంలో పెట్టబడ్డాయి. ఇతనికీ, ఒక ముసిలావిడకు మధ్య జరిగే ఆసక్తిదాయకమైన సంభాషణ చూడండి.

ముసిలావిడ : రక్తపిపాసులైన కసాయివారుకూడా వున్నారు. మేమూ బలహీనులం-నిస్సహాయులం. ఈ కసాయివారు మా ఆవులను చంపేస్తున్నారు నాయనా!

హర్‌ఫూల్‌సింగ్: అలాగా-అయితే నేను క్షత్రియుణ్ణవుతాను. గోవులబాధలను శాశ్వతంగా నివారిస్తాను. ఆ కసాయివారికి బుద్ధిచెప్తాను మనలను అణచివేసిన వారందరినీ, బ్రిటీషు అధికారులను నేను అణచివేసినట్లుగా, దుర్గ అనుగ్రహంతో కాలరాచేస్తాను. (హర్‌ఫూల్‌కరపత్రం 1936)

ఈ కరపత్రాలు 1930 వ, దశకం చివరిభాగంలో పంజాబ్ అంతటా విస్తృతంగా పంచబడ్డాయి. అప్పుడే పంజాబ్‌లో హిందూ-ముస్లిం విభజన భావం తీవ్రమౌతూ వుంది.

ఒకవైపు మతసంబంధమైన సాహిత్యాన్ని బ్రిటీష్‌పాలకులు నిషేధించారు. మరోవైపు ఈమతవిభేదాలను రెచ్చగొట్టడాన్ని వ్యతిరేకించే వామపక్షసాహిత్యాన్ని కూడా పాలకులు నిషేధించారు. మతసంబధమైన ఘర్షణలు కమ్యూనిస్టుల చొరవను పెంచాయి. మతవిషయాలను ప్రక్కనపెట్టి, ఇతర విషయాలు ఆలోచించమని పార్టీ సలహా ఇచ్చింది. ఇటువంటి సందేశాన్నిస్తూ ఒక పోస్టర్ వెలువడింది. దాన్ని కార్మికులకు అందించాలని ప్రయత్నించారు. మత ఘర్షణలకు ఆర్థికపరమైన కారణాలు చూపి కార్మికులను చైతన్యపరచేవారు.

అటువంటి కరపత్రం "విప్లవానికి పిలుపు" (ఇంక్విలాబ్ నారా) నిషేధింపబడింది. అది "ప్రపంచకార్మికులూ, పేద రైతాంగమూ సమైక్యమై సామ్రాజ్యవాదాన్ని కూలదోయ"మని పిలుపు ఇచ్చింది. అది ఇంకా ఇలా సాగింది. "ప్రజల రక్తంతో ఈ ప్రభుత్వం హోలీ పండుగ చేసుకొంటోంది. ఈ బ్రిటీషు ప్రభుత్వపు తొత్తులైన హిందూ, సిక్కు, ముస్లిం పెట్టుబడిదారులు అంటించినఅగ్ని మహాజ్వాల

ఖగా ఎగిసి దేశంలోని శాంతియుత వాతావరణం భగ్నం కావటాన్ని ఆనందంగా చూస్తున్నారు....వీరు హిందూ, ముస్లిం, సిక్కు మతాలకు చెందిన సామాన్య ప్రజా నీకాన్ని లూటీ చేశారు. తద్వారా దేశంలో అలజడిని సృష్టించారు."

ఇటువంటి వామపక్ష, సోషలిస్టు సాహిత్యం చాలా తక్కువేవచ్చింది. ఎక్కువ సాహిత్యం, కరపత్రాలు, రాజకీయ కార్యక్రమాలకు చెందినదే. కాంగ్రెసువారి కార్య క్రమాలపై కమ్యూనిస్టు దృక్కోణం నుంచి విమర్శ, పండితచర్చ మెజారిటీ ప్రచుర ణల్లో కనబడుతోంది. వీటిలో కొన్ని కరపత్రాలు స్పష్టంగా కాంగ్రెసు నాయకత్వంపై దాడిచేశాయి. 1932 నవంబర్‌లో భారతదేశంలో వామపక్ష కమ్యూనిస్టు సాహిత్యంపై పూర్తి నిషేధం విధించారు.

ఇలా నిషేధించిన సాహిత్యంలో ఉత్తమసాహిత్యగ్రంథమైన నవల "ది బ్రదర్స్ కరంజోవ్" కూడా వుంది. 1932 నుంచి 1935 వరకు దాదాపు వేయి గ్రంథాలు ఇండియాలోకి రానీయకుండా నిషేధింపబడ్డాయి. ఆ సమయంలో ఈ నిషేధాన్ని ఎదుర్కొంటూ కమ్యూనిస్టుపార్టీ కొత్తపేర్లతో పత్రికలు ప్రచురించడం, రహ స్యంగా ప్రచురించడం చేసింది.

బ్రిటీషు సైన్యం ఓటమికి గురైన వార్తలకు ప్రాధాన్యతనిస్తూ వచ్చిన యుద్ధ వ్యతిరేక కరపత్రాలు ఈ నిషేధానికి గురైన సాహిత్యంలో ప్రధానంగా వుంది. బెంగాల్, పంజాబ్, బొంబాయి రాష్ట్రాలు ఇటువంటి కరపత్రాలు ముద్రించడం, పంపిణీచేయడానికి కేంద్రాలుగావుండేవి. ప్రింటింగ్‌ప్రెస్సులపై దాడులు అధికంచేయ డంతో కమ్యూనిస్టులు సైక్లోస్టైల్ చేసిన బులెటిన్లు ప్రచురించడం ప్రారంభించారు. ఈ బులెటిన్ల మొదటి పేజీలో పెద్ద అక్షరాలతో, "యుద్ధవ్యతిరేకవార్తలు- సెన్సార్ కానివి" అని ముద్రించేవారు. వీటిలో భారతీయ సైనికులు ఏ రంగంలో ఎందరు సైన్యంనుంచి రాజీనామాచేసి వచ్చేశారో తెలియచేసే వివరాలుండేవి. యుద్ధవ్యతిరేక వార్తలు పంపించవలసిందిగా పాఠకులకు విజ్ఞప్తిచేసేవి. "అటువంటివార్త సైన్యంపై దావుదెబ్బతీసేదే- పత్రికా స్వాతంత్ర్యానికి విధించిన సంకెళ్ళపై సమ్మెట దెబ్బ లాంటిదే-" అని వ్రాసేది.

నిషేధించిన సాహిత్యంద్వారా జరిగిన ప్రచారం గణనీయమైంది. ఇది ఏం చేసినా చేయలేకపోయినా బ్రిటీషు పరిపాలకులను గాభరా పెట్టేది. ఈ అణచివేత చర్యల వల్ల వచ్చిన ఈసాహిత్యం స్థానికమైన వస్తువూ, రూపమూ పెనవేసుకొని వుండేవిధం గానూ, తేలికభాషలో. ప్రజలనోళ్ళలో నానే పలుకుబడులతో కూడిన విధంగానూ- సామ్రాజ్యవాద వ్యతిరేకత కల్గివుండే విధంగానూ రూపొందించ బడింది. 1945లో ప్రొవిజనల్‌ప్రభుత్వం ఏర్పడేంతవరకు, నిషేధాన్ని తొలగించనంత వరకు ఈ రక మైన కరపత్రాలు పెద్ద ఎత్తున ప్రచురింపబడ్డాయి.

(వి. కృష్ణ అనంత్. 'ది హిందూ-' 6–9–92 సౌజన్యంతో)

# సాంస్కృతిక సామ్రాజ్యవాదం - స్టార్ టి. వి.

— డా॥ శాంతికుమార్

"చూశారా మనవాడి ఘనత ! నిన్న వాళ్ళ కాలేజీలో ఫిజిక్స్‌లో పరీక్షపెడితే మన బడుద్దాయ్‌కి ఫెయిల్ మార్కొచ్చిందట" అంది తులసి వంట గదిలోంచే.

ఫైల్స్ ఇంటికి తెచ్చుకుని మంచి బాలుడిలా బుద్ధిగా హోంవర్క్ చేసుకుంటూన్న రాజారావు శ్రీమతి మాటల్ని ఉపేక్షించాడో, వినిపించలేదోగానీ ఫైల్లో నుండి తల తిప్పలేదు.

"ఆఁ! నా కంఠ శోషేగానీ....ఇంటి సంగతులు పట్టించుకునే అలవాటు మీకుంటేగా?" తన ప్రపంచం నుంచి బయటకొచ్చి మరి కాస్త పెద్దగా అరిచింది తులసి.

"ఏం జరిగిందో చెప్పకుండా ఏమిటే ఆ కేకలు?" చిరాగ్గా అన్నాడు రాజారావు.

"ఇన్నాళ్ళూ సుత్తో, చెత్తో, ఆ దూరదర్శన్ ప్రోగ్రాంలు కాసేపు చూసి చదువులో పడిపోయేవాడు బిడ్డ. ఈ స్టార్ కనెక్షనొకటి తగలెట్టారుగా కొంపలో. ఇరవై నాలుగు గంటలూ....కాలేజీ ఎగ్గొట్టి మరీ టీవీ చూసి మన వెధవ ఫిజిక్స్‌లో ఫెయిలయ్యాడట !" గోడు వెళ్ళబోసుకుంది తులసి.

"ఏమిటోయ్....చెప్పనేలేదు. మనింట్లో స్టార్ కనెక్షన్ వుందా? కాసేపు టీ.వీ. పెట్టవోయ్. చూద్దాం" అప్పుడే ఇంట్లోకి వస్తున్న మూర్తి అన్నాడు ఆసక్తిగా.

తులసి వంటింట్లోకి, రాజారావు టీ.వీ. దగ్గరకి నడిచారు.

స్టార్ టీ.వీ. చూస్తూ "ఏమైనా టెక్నికల్‌గా మనం ఆ స్థాయికి చేరాలంటే మరో పాతికేళ్ళయినా పడుతుంది. అన్నట్లు మొత్తంమీద ప్రోగ్రాంలెలా వుంటున్నాయ్ ?" మూర్తి అడిగాడు— మ్యూజిక్ టి.వి.లో మడోన్నాని రెప్పలార్పకుండా కళ్ళింత చేసుకుని చూస్తూ.

అప్పటికి నాలుగైదు నెలలుగా అడపాదడపా స్టార్ ప్రోగ్రాంలు చూస్తున్న రాజారావు ఓ నిట్టూర్పు విడిచి, "మూర్తీ! ఆ కార్యక్రమాలు రూపొందించడంవెనుక ఎంత సాంకేతిక విలువలున్నా, మరెంత శ్రమ ఉన్నా....స్టార్ కార్యక్రమాల్లో మాత్రం ఈ ప్రపంచానికి ప్రధాన బోధక శక్తి అయిన 'శ్రమ'ని ప్రతిబింబించే అంశం నేనింత వరకూ చూడనే లేదు. ఆ మాట కొస్తే ప్రపంచంలోని అనేక ప్రాంతాల్ని నేను స్టార్ టీ.వీ.లో చూశాను. అయితే పేదరికాన్ని యిప్పటి వరకూ ఒకే ఒక్క ప్రోగ్రాంలో చూశాను. అదీ.... మన కలకత్తా నగరాన్ని చూపిన ఓ అరగంట కార్యక్రమంలో !"

"ఇంకా ఏమేం ప్రోగ్రాంలొస్తుంటాయి ?"

"ఫ్యాషన్లు, ఫైవ్‌స్టార్ వంటలు, శరీర సౌందర్యాన్ని పెంచుకునే చిట్కాలూ, హాస్యం పేరుతో బూతు జోకులూ, డ్రామాలు, సినిమాలు, హింస, సెక్సూ, రక్తపాతాలు...."

"ఇంకా...."

"ఖరీదైన పిచ్చివాళ్ళ" అరుపులూ, శృంగార వికారాలతో నిండిన ఎం.టి.వి; లక్షాధికార్లు, కోటీశ్వరుల ఆటలూ!"

"చైనీస్ ఛానెల్ కూడా వుందటగా !"

"ఆఁ వుంది! పతనమైన సోషలిస్టు దేశాల సరసన కాస్త్రో కూస్తో బ్రతుకు నిలుపుకుంటున్న చైనానీ చేర్చొద్దూ ?"

ఇలాంటి సందర్భాలు ఒక్క రాజారావు ఇంటికే పరిమితం కావు.

స్టార్ టి.వి..... దూరదర్శన్ 'చచ్చు' కార్యక్రమాల నుండి సగటు మనిషికి విముక్తి కలిగించిన సాధనం కావచ్చు. అంతరిక్షం నుండీ జరుగుతున్న ఈ సాంస్కృతిక దాడియొక్క దుష్ఫలితాలు సామాన్యుడికి అంతుపట్టకపోవచ్చు. స్టార్ టీ.వీ. పెద్ద నగరాలూ పట్టణాలపై తప్ప గ్రామ ప్రాంతాలపై మరికొన్ని సంవత్సరాల వరకూ తన ప్రభావం చూపలేదని ప్రభుత్వమూ, మేధావులు కొందరూ భావించి ఉండవచ్చు.

ఈ వూహ తప్పని యిప్పటికే రుజువైంది. మనదేశంలో నగర, పట్టణ ప్రాంతాలల్లో స్టార్ టీ.వీ. ప్రేక్షకుల సంఖ్య నెలకు 15 శాతం చొప్పున పెరుగు తున్నట్లు గణాంక వివరాలు తెలుపుతున్నాయి. ఈ విషయంలో గ్రామ పాంతాలు కూడా ఏమాత్రం వెనుకబడి లేవని చెప్పవచ్చు. ధనవంతులు తమ కోసం ఏర్పాటు చేసుకున్న డిష్ ఏంటెన్నాల నుండి గ్రామంలోని యితరులకూ కనెక్షను యివ్వటం ద్వారా గ్రామాలల్లోనూ స్టార్ టీ.వీ. నిర్వాహకుల ప్రణాళికలో ఉన్న హిందీ ఛానెల్ పూర్తి స్థాయిలో ప్రసారాలు చేయగల దశకు చేరితే ఈ పెరుగుదల అనూహ్యంగా వుండవచ్చు. దూరదర్శన్ ప్రేక్షకుల సంఖ్య చిత్రహార్, చిత్ర లహరి, శుక్ర, శని, ఆదివారాల సినిమాలకు పరిమితమై, స్టార్ టీ.వీ. ప్రేక్షకుల సంఖ్య వేగంగా పెరుగుతున్నట్లు నివేదికలు తెలుపుతున్నాయి. ఇదే పరిస్థితి కొన సాగితే మన టీవీ జీవచ్ఛవంలా మిగలటం అనివార్యమవుతుంది. అందువల్ల రానున్న వ్యతిరేక ఫలితాలు ఇలా వుంటాయి—

స్టార్ టీ.వీ. మన దేశ వినియోగ వస్తు పరిశ్రమనూ, సినీ పరిశ్రమనూ తీవ్రంగా నష్టపరచటమే కాకుండా ప్రకటనల సొమ్ము రూపంలో మన ఆర్థిక వ్యవస్థను దెబ్బ తీస్తుంది. యువతను సెక్సు అరాచకాలకు పాల్పడే నీతి బాహ్యులుగా తయారుచేసి

యిప్పటికే పతనపథంలో ఉన్న నైతిక, సంస్కృతీ విలువల్ని మరింత వేగంగా దిగజార్చుతుంది. స్త్రీని అవమానకరంగా చిత్రిస్తుంది. సెక్సుపరమైన విశృంఖలతను పెంచి పోషిస్తుంది. అంతేకాక టీ.వీ. మీడియాపై పాలక వర్గాలు నిలుపుకుంటున్న పట్టు స్టార్ ప్రవేశంతో పూర్తిగా కోల్పోయే ప్రమాదమూ వుంది. ['ప్రమాదం' అని అనటానికి కారణం - మన ప్రభుత్వాలు ఈ దృశ్య మాధ్యమాన్ని వినియోగించుకుంటోంది గనుక]. విదేశీమారక ద్రవ్యమో, మరో ప్రయోజనమో ఆశించి నిమ్మకు నీరెత్తినట్లున్న సమాచార మంత్రిత్వ శాఖ రానున్న ప్రమాదాన్ని [సంస్కృతిపరంగా] ముందుగానే ఊహించి జాగ్రత్తపడే విజ్ఞతను ప్రదర్శించలేక పోయింది. ఫలితంగా స్టార్ టీ.వీ. ఉప ఖండంలో తన స్థానాన్ని సుస్థిరపర్చుకొంది.

ప్రారంభంలో - భారతీయ మార్కెట్‌పై దృఢమైన పట్టు సంపాదించి, ప్రకటనల ద్వారా సుస్థిరమైన భారీ ఆదాయాన్ని సంపాదించ గల స్థాయికి చేరటానికి మూడు సంవత్సరాలు పట్టవచ్చునన్న అంచనాతో రంగప్రవేశం చేసిన స్టార్ టీ.వీ. మూడునెలల అతి తక్కువ కాలంలోనే భారతదేశపు అత్యధిక భాగాన్ని ఆకర్షించి బుట్టలో వేసుకుని కలలో కూడా వూహించని విజయాన్ని సాధించగలిగింది. స్టార్ టీ.వీ. యొక్క ఈ అసాధ్యమైన విజయాన్ని చూసి మనం వెంపేలెత్త వలసిన అవసరముందా? అంటే - 'ఖచ్చితంగా వుంద'నే చెప్పవలసి వస్తుంది. ఎందుకంటే ఈ ప్రసారాల తళుకు బెళుకుల మేలి ముసుగు వెనుక పొట్ట విచ్చిన మేడి పండు దాగి వుంది.

ఇంద్రధనుస్సులా ప్రజల్ని ఆకర్షిస్తూ, స్టేటస్‌కి చిహ్నంగా మారిన ఈ స్టార్ టీ.వీ. అనే కాల సర్పం - ఎమ్.టీ.వి. స్టార్. స్టార్ ప్లస్, బి.బి.సి, ప్రైమ్ స్పోర్ట్స్, విదేశీ భారతీయుల పెట్టుబడుల నేపథ్య సహకారంతో అవతరించనున్న హిందీ ఛానెల్ అనే ఆరు తలల ద్వారా కుమ్మరించేదంతా కాలకూట విషమే! [ఈ విదేశీ భారతీయులే - NRI లు. వీరే విదేశీ అశ్లీల చిత్రాల్ని టన్నులకొద్దీ మనదేశం పంపి సొమ్ము చేసుకుంటూన్న దేశ భక్తులు!]

అసలు స్టార్ టీ.వీ. మనదేశం మీద యింత హఠాత్తుగా మెరుపుదాడి చెయ్యటానికి కారణమేమిటి? దాని ప్రసార పరిధిలో ఉన్న 38 ఆసియా దేశాలలో నివసించే ప్రజల మానసిక వికాసంకోసం కాదన్నది సుస్పష్టమే!

ఆసియా ఖండంలోనూ, ప్రత్యేకించి ఇండియాలో స్టార్ టీ.వీ. ప్రవేశించటాని మూడు ప్రధానమైన అంశాలు గల ఆర్థిక నేపథ్యం వుంది.

1. ఇండియా, కొరియా, తైవాన్ మొదలైన దేశాల్లో కొనుగోలు శక్తి గణనీయంగా పెరుగుతున్న ఉన్నత మధ్య తరగతి వర్గం యొక్క అభివృద్ధి.

2. మిగతాప్రపంచంలోని అనేకదేశాల్లో—ముఖ్యంగా అమెరికా, ఐరోపాదేశాల ఆర్థికవ్యవస్థలు అవరోహణక్రమంపట్టగా—లాటిన్ అమెరికా, ఆఫ్రికాదేశాల ఆర్థిక వ్యవస్థలు కుప్పకూలిపోతున్నాయి. అదేసమయంలో ఆసియాదేశాల్లో గృహోపకరణ వస్తువుల కొనుగోలుశక్తి ఆశ్చర్యకరంగా పెరుగుతోంది.

3. అసూహ్యమైనరీతిలో మార్కెట్ విస్తరిస్తోంది. ఇందుకు మనదేశాన్నే ఉదహరించుకోవచ్చు. ప్రస్తుతం 200 మిలియన్ల కొనుగోలుదార్లతో అత్యంత పెద్దదిగా వున్న మన మార్కెట్, మరో అయిదేళ్ళలో 400 మిలియన్ల కొనుగోలుదారులున్న భారీ మార్కెట్‌గా అవతరించబోతోంది. ఇది ఐరోపాఖండంలోని మొత్తం జనాభాకు రెట్టింపు.

[మార్కెట్ పెరగటమంటే పేదరికం రూపుమాసిపోతోందని అర్థం కాదు. కొన్నివర్గాల కొనుగోలుశక్తి ఎంతగా పెరుగుతూవుంటుందో అంతగానూ పేదరికం స్థాయీ పెరుగుతూనే వుంటుంది.]

పశ్చిమదేశాల కొనుగోలుదారుల అవసరాలకు మించి ఎన్నోరెట్లు ఆదేశాల్లో ఉత్పత్తిఅవుతున్నాయి. ఇబ్బడిముబ్బడిగా పెరుగుతూన్న ఆ వుత్పత్తులకు మార్కెట్ సృష్టించిపెట్టడంకోసమే— పశ్చిమదేశాల వ్యాపారప్రయోజనాల కోసమే, కొనుగోలుదారుల శాతం భారీగా పెరుగుతున్న ఆసియాదేశాలపై, ముఖ్యంగా మనదేశంపై స్టార్ టీ.వీ. పిడుగుపాటులా విరుచుకుపడింది!

ఆసియాదేశాల్లో పెరుగుతున్న ఆర్థికశక్తిని వస్తువ్యామోహపు రొంపిలోకి మళ్ళించి తమవస్తువులకు మార్కెట్ సృష్టించుకోవటం, పెంచుకోవటం, తద్వారా ఆయాదేశాల ధనరాశుల్ని లాభాలరూపంలో కొల్లగొట్టే ఐరోపాదేశాల లక్ష్యానికి తన స్వంత ఆర్థికప్రయోజనాల [ప్రకటనల రూపంలో]కోసం స్టార్‌టీవీ సహకరిస్తోంది.

ఇక్కడ మనం భారతీయ జీవనవిధానానికి సంబంధించిన ఓ అంశం గుర్తుచేసుకోవటం అవసరం. ప్రతివ్యక్తీ తనసంపాదనలో కొంత భవిష్యదవసరాలకోసం దాచుకోవటం అలవాటు. పేదవారుకూడా శక్తిమేరకు పొదుపుచేసే స్వభావం కలిగివుంటారు. అనేక సందర్భాల్లో భవిష్యత్తు అవసరాలు కడుపు కట్టుకునికూడా పొదుపు చెయ్యటం మనకు నేర్పాయి. [సామాజిక, ఆర్థిక మొదలైనవి.] ప్రపంచంలోని పొదుపు మొత్తంలో అత్యధికంగా 23 శాతం వస్తువినిమయ ద్రవ్యం మనదేశంలో పొదుపురూపంలోనే ఉండిపోతోంది. [కోరికలపై అదుపు, ఆర్థికపరంగా సహజంగా వున్న జాగ్రత్తపడేలక్షణం, అతిసామాన్యజీవితాన్ని గడపటం, ఉమ్మడికుటుంబ వ్యవస్థలవల్ల యిది సాధ్యమవుతోంది]

అదేసమయంలో-అమెరికాని చూద్దాం. గతంలో ఎలా ఉన్నప్పటికీ యిప్పుడు మాత్రం సామ్రాజ్యవాద విశృంఖలతతో తెగబలిసి అవసరాన్ని మించి తినడం హద్దు

్కుండా చరించడం, విచ్చలవిడి శృంగారమే జీవితంగా బ్రతుకుతూ, ఇతరుల అవసరాల్ని నిర్లక్ష్యంచేసే పరిస్థితిలోవుంది. ఈస్థితిలోవుండే ఏదేశానికైనా లాభార్జనతప్ప మరో 'యావ'వుండదు. అందుకు అనుకూలంగా అసియాఖండాన్ని తయారుచేసే కృషిలోభాగంగా బలమైన తొలిమెట్టుగా ఈ "తారాదర్శిని" (స్టార్ టీవీ)ని ప్రవేశపెట్టింది. స్టార్ టీవీ ప్రకటనలప్రభావంతో వస్తువ్యామోహం విపరీతమై మనప్రజల పొదుపుమొత్తాలు లాభాలరూపంలో తరలించబడతాయి. మ్యూజిక్ టీ.వీ.లో లయబద్ధంగా విన్పిస్తూకనిపించే స్త్రీల అర్ధనగ్న విన్యాసాల నిత్యసందర్శనం యువతలో నైతిక నిబద్ధతనూ దిగజార్చుతుంది.

అమెరికాకి చెందిన ఒక స్టాక్ విశ్లేషణకంపెనీ—ఈశతాబ్దాంతానికి భారత స్టాక్ మార్కెట్ ప్రపంచంలోనే అత్యంత పెద్ద స్టాక్‌మార్కెట్‌గా అవతరించబోతోందని అంచనావేసింది. ఇటీవలి స్టాక్‌మార్కెట్ కుంభకోణంవంటి తాత్కాలిక పరిణామాల్ని ప్రక్కనుంచి పరిశీలించినా భారత స్టాక్‌మార్కెట్ పెరుగుదలక్రమంలో దూసుకుపోతున్నట్లు అర్థమవుతుంది. ఈ అనుకూల పరిణామాన్ని ముందేవూహించి విశ్లేషించగలిగిన పెట్టుబడిదారీదేశాలు కోటానుకోట్ల డాలర్ల పెట్టుబడులతో అనేక కొత్తపరిశ్రమలను నెలకొల్పేప్రయత్నాల్లో తలమునకలై వున్నాయి. ప్రస్తుత పాలక వర్గాల ఆర్థికవిధానంకూడా అన్నిరకాల విచక్షణలనూ పక్కనెట్టి విదేశీ పెట్టుబడులకు అనేకరాయితీలిచ్చి మరీతలుపులు తెరిచి స్వాగతం పలుకుతున్నాయి. ఈ పెట్టుబడులు ప్రభుత్వ రాయితీలద్వారా అనేకకోట్ల డాలర్లు లాభాలరూపంలో దేశంసరిహద్దులు దాటిపోతాయి. అంతేకాక— సాలీనా 1000 కోట్ల డాలర్లు వ్యాపారప్రకటనల సొమ్ము రూపంలో స్టార్ టీవీ లాకర్లలో చేరిపోతుంది. ఇలా—స్టార్ టివి ప్రవేశం వెనుక ఓ మహాదారుణమైన ఆర్థికకుట్ర చోటుచేసుకుంది. ఈరకంగా వ్యాపార, సాంకేతికపరమైన ప్రమేయంవల్ల ఆసియాదేశాల ఆర్థికరంగంలో ఈ క్రిందిమార్పులు నిరాటంకంగా జరిగిపోతాయి.

1) మనదేశంలో వినియోగవస్తు పరిశ్రమను అభివృద్ధిచేసుకోవాలన్న ఆలోచనను మొగ్గలోనే తుంచేస్తుంది.

2) స్వయం సమృద్ధం కావాలన్న ఆలోచనను అంతంచేసి, ప్రత్యామ్నాయంగా దిగుమతులు అనివార్యమయ్యేపరిస్థితిని కల్పిస్తుంది.

3) ఎగుమతుల్ని పెంచుకోవటంద్వారా విదేశీ మారకద్రవ్య నిలువల్ని పెంచుకొంటేతప్ప గౌరవంగా మనుగడసాగించలేని బలహీన ఆర్థికపరిస్థితిలో దిగుమతుల్ని మననెత్తిన రుద్దుతుంది.

4) మనదేశానికి హక్కుగా చెందవలసిన కోటానుకోట్ల డాలర్లను మూలధనం, వ్యాపారలాభం, ప్రకటనల రూపంలో నిలువుదోపిడీ చేస్తుంది.

అమెరికాకి చెందిన కోకాకోలాసంస్థ మనదేశానికిచెందిన ఓ శీతలపానీయాల సంస్థ (లెహెర్?)తో కలిసి ఆసియావ్యాప్త టీవీ ప్రకటనల కంపెనీ స్థాపించటానికి స్టార్ టీవీతో కోట్లాదిడాలర్ల విలువైన ఒప్పందాన్ని చేసుకున్నట్లు ఇటీవల వెలువడిన వార్త! దీనితో పద్మవ్యూహ రచన పూర్తయినట్లే! యిక మిక్కిలిపోయిన ఆహారపదార్థాలూ, అరిగిపోయిన టీవీ ప్రోగ్రాంలూ, కాలంచెల్లిన వస్తువులూ 'నిత్యనూతన చిహ్నం'తో మనల్ని చుట్టుముట్టడమే తరువాయి.

ఈ మార్గాన్నే అనుసరిస్తూ అనేక బహుళజాతి సంస్థలుకూడా భారీ పెట్టుబడులతో ఆరోహణక్రమంలో వున్న భారతీయమార్కెట్‌లో చొరబడతాయి. ఈ ప్రమాదాన్ని ఉపేక్షిస్తూ— స్టార్ టీవీని అనుమతించటంద్వారా ప్రసార మాధ్యమాల ద్వారాలను తెరిచివేసినట్లు ప్రకటించి పాలకులు చేతులు దులుపుకోవటం సమంజసంకాదు. ఇటీవల మన్మోహన్‌సింగ్‌గారు జపాన్ అప్పుకోసం వెళ్ళినప్పుడు జపాన్‌కూడా మన ప్రభుత్వ 'తలుపులు తెరిచేవిధానాన్ని' విమర్శించిందట. [అందులో వారికి ఏ స్వార్థ ముందో?!]

ఇప్పటివరకూ మనం—సరుకు, మార్కెట్, వ్యాపారం, ప్రకటనలు యిత్యాది రూపాల్లోస్టార్ టీవీ ద్వారా జరిగే ఆర్థికదోపిడీని మాత్రమే చర్చించాం.

దానికంటే తీవ్రంగా, చాపక్రిందనీరులా నిశ్శబ్దంగా జరిగే హాని మరొకటుంది- అదే-మననైతిక, మానసికవిలువల్ని కూకటివేళ్ళతో కదిలించెయ్యటం, స్టార్ టీవీ ప్రసారంచేస్తున్న సాంస్కృతిక కాన్సర్ ద్వారా యిది చాలా సున్నితంగా, ఎంతో వేగంగా జరిగిపోతుంది. అయితే-మనపాలకులు ఎందుకు ఉపేక్షిస్తున్నారీప్రమాదాన్ని? జవాబు చాలా తేలిక. దేశాన్ని నిర్మాణాత్మకంగా తీర్చి దిద్దటంలో విఫలమైన ప్రభుత్వాలు యువతలో అసంతృప్తి జ్వాలలురేగి, విప్లవించి, వారి సింహాసనాల్ని కూల్చివేసే ప్రమాదం జరక్కుండా వుండాలంటే- నీచ, హీన సంస్కృతిని వారిపై వెల్లువలా ప్రవహింపజేసి, సామాజిక బాధ్యతకు అతీతులుగా, చవటాయలుగా, విషయవాంఛాపరులుగా తయారుచేసి, తమను పెంచిపోషిస్తున్న వ్యవస్థావృక్షం కూకటివేళ్ళతో కూలిపోకుండా రక్షించుకునే కృషిలో భాగంగా ఈ లాంటి ఎత్తుగడను ప్రపంచంలోని అనేక పెట్టుబడిదారీ దేశాలు ఆచరిస్తున్నట్లే మన పాలకులూ అమలు చేస్తున్నారు. ప్రస్తుతం మన సినిమాల్ని చూసినా ఈ వాస్తవమే అంతర్లీనంగా గోచరిస్తుంది. అసలు సెన్సార్ బోర్డు వుందా? అని అనుమానపడే సినిమాపేర్లూ, జుగుప్సాకరదృశ్యాలూ, ద్వంద్వార్థ సంభాషణలూ పెరిగిపోవటం మనం చూస్తూనే వున్నాం. ఆవేదన చెందుతూనే వున్నాం. విదేశీ భారతీయులు మనకు పంపుతున్న సినిమాలు (విదేశీమారక ద్రవ్య లాభంతోపాటు యువత అట్టడుగు బలహీనతలపైపు ఆకర్షింపబడటమనే లాభమూ వుంటుంది) దూరదర్శన్‌లో శుక్రవారం అర్ధరాత్రి సినిమాలూ కూడా-పాలకుల సాంస్కృతిక సేవకూ నైతిక విలువల పరిరక్షణకూ నిదర్శనాలని

మనం నమ్మాలి! కాగల కార్యం గంధర్వులే నెరవేరుస్తున్నప్పుడు పాండవులు ప్రోత్సహించటం సహజమే కదా!

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ షిల్లర్, "మూడో ప్రపంచ దేశాలపై సాంస్కృతిక అధిపత్యానికీ, తమ వస్తు వినియోగాన్నీ, సేవలనూ విస్తరించేందుకూ, పాశ్చాత్య బహుళజాతి కంపెనీలు దృశ్య ప్రత్యేకతద్వారా ప్రజాదరణ పొందిన టీవీ మీడియంను వినియోగించుకుంటున్నాయి. ఈ దేశాలు తమ స్వార్థ ప్రయోజనాలకు అనుకూలంగా తమ వస్తువుల నాణ్యతను గురించి గొప్పలు చెప్పుకుంటూ.... వాటిపట్ల ఆసియా దేశాల ప్రజల్లో ఆసక్తిని పెంచేవిధంగా వార్తల్నీ, వినోదకార్యక్రమాల్నీ ఎగుమతి చేస్తాయి. కొన్ని మూడో ప్రపంచ దేశాల్లోని అధికార వర్గాలు పాశ్చాత్య సరుకుల్ని దిగుమతి చేసుకోవటం, ప్రసారకార్యక్రమాలు, సాంకేతిక పరిజ్ఞానం, సేవలు వినియోగించుకోవటం ద్వారా వారితో చేయి కలుపుతున్నాయి. ఇది "సాంస్కృతిక సామ్రాజ్యవాదం!" అనిపించుకుంటుంది" అని తీవ్రంగా విమర్శించారు. ఈ సాంస్కృతిక సామ్రాజ్య వాదం ద్వారా వారి అదనపు ఉత్పత్తులు అమ్ముడుపోవచ్చు. వారికి లాభాలు రావచ్చు. అంతకంటే దారుణమైన ప్రభావం—ఆచారాలు, విలువలు, సంస్కారం, సామాజిక స్థిరత్వం, కుటుంబ జీవితం, సామాజికంగా స్త్రీ గౌరవం, నైతికత వంటి అనేక సంస్కృతీపరమైన అంశాలపై పడుతుంది.

బి.బి.సి ఛానెల్‌కి అలవాటుపడటంవల్ల- బి.బి.సి కళ్ళతో ప్రపంచాన్ని చూస్తూ మన సంస్కృతికి చెందని, మనం జీర్ణించుకోలేని కషాయాన్ని మిషన్ స్కూల్ విద్యలా బలవంతంగా మింగటం .... దానికీ అలవాటైపోవటమూ జరుగుతుంది. టెలివిజన్ అనబడే ఈ దృశ్యమాధ్యమానికి ఓ అద్భుతశక్తి వుంది. వాస్తవంతో యథాతథంగా సంబంధం ఏమాత్రమూలేని కట్టుకథల్ని అబద్ధమనటానికి వీల్లేనంత కట్టుదిట్టంగా సృష్టించగలగటం. దాన్నే మనం మసిపూసి మారేడుకాయ చెయ్యటం అంటాం.

స్టార్ టీవీ మత్తులో మునగటం జరిగితే మనదేశంలోని పిల్లలూ పెద్దలూ కూడా 'ఈ దేశంలో ఎందుకు పుట్టామా?' అని విచారపడేటంత 'భ్రమ' లకు లోను చెయ్యగలదు. మనం ఈ స్టార్ టీవీని ఇంతగాఢంగా మన జీవితాల్లోకి ఆహ్వానించటంద్వారా అంతరాంతరాల్లో మనమింకా భావజాల బానిసత్వంలోంచి బయటపడలేదని అంగీకరిస్తున్నట్లే. మనం పరిపూర్ణంగా స్వతంత్రులం కాదని రుజువు చేసే అనేక యితర అంశాల లిస్టులోకి మనం స్టార్ టీవీకి తలుపులు తెరవటాన్ని కూడా చేర్చుకోవచ్చన్నమాట.

స్టార్ టీవీ 38 దేశాలకు ప్రసారాలు అందించటంలో ఆయాదేశాల ప్రసార పరిధిలోకి అక్రమంగా చొరబడినట్లే. అయితే- తమ ప్రసారాలు కమ్యూనికేషన్

బ్యాండ్ - అంటే సి.బ్యాండ్‌లో జరుపుతున్నట్లు స్టార్ టీవీ సమర్ధించుకుంటోంది. అదే నిజమయినప్పటికీ (నిజానికి నిజం కాదు) "ఒక ఉపగ్రహం విడుదల చేసే సంకేత తరంగాలు ఏ దేశానికి నిర్దేశించబడుతున్నాయో ఆ దేశ సరిహద్దులను మించి మరోదేశ భూ కేంద్రాలకు చేరరాదు" అన్న అంతర్జాతీయ టెలికమ్యూనికేషన్ యూనియన్ (ITU) నిబంధనావళిని అతిక్రమించినట్టే అవుతుంది. స్టార్ టీవీ ప్రసారాలు హాంగ్‌కాంగ్ సరిహద్దుల్ని దాటి 38 దేశాల్ని చుట్టు ముడుతున్నాయి. పై అంతర్జాతీయ నిబంధనలు అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయోజనాలకు భంగం కలిగించే రేడియో ప్రసారాల్ని, అలవరుసల్ని, ఆర్థిక హక్కుల్ని రక్షించేవి. ఒక దేశం మరో దేశ భూ కేంద్రాలకు అందే ప్రసారాలు జరపకుండా యునెస్కో, ఐక్యరాజ్యసమితి యొక్క అంతరిక్ష కమిటీ, యునెస్కోవారి మెక్‌బ్రైడ్ కమిషన్, ITU వారి మెయిట్‌లాండ్ కమిషన్‌లు పర్యవేక్షించాలి. అంటే ఐనో ఆవరణంపై దురాక్రమణను అదుపు చెయ్యాలి. మరి స్టార్ టీవీ ప్రసారాలను అనుమతించటం అభివృద్ధి చెందుతున్న దేశాల ప్రయోజనాల్ని పరిరక్షించట మవుతుందా? ఇదే కొనసాగితే అలవరుసల (Frequency) చౌర్యానికీ దురాక్రమణకీ అంతం ఎక్కడ? (ఈ ప్రశ్న పుట్టడానికి పై సంస్థలు నిర్మించిన నిబంధనలే కారణమైతే — అవసరమైతే ఆ నిబంధనల్ని మార్పించే అధికారం (?) వారి చేతుల్లోనే ఉంది కదా!)

స్టార్ టీవీ ప్రసారాల్ని నిర్వహిస్తున్న హిచ్‌విజన్ సంస్థ ఢిల్లీతో ప్రారంభించి మనదేశంలోని అనేకచోట్ల తన కార్యాలయాలను తెరిచే ప్రయత్నంలో వుంది. అందుక్కారణం స్పష్టమే. స్టార్ టీవీ పునాదిని పటిష్ఠం చెయ్యటమూ, భారతదేశంలోని ఉత్పత్తిదారులనుండి ప్రకటనలు సేకరించి తద్వారా భారీ ఆదాయాన్ని సంపాదించటమూ! అందుకు స్టార్ టీవీ, బి.బి.సి.లు ప్రభుత్వంతో సంప్రదింపులు ప్రారంభించాయి. ఆ ప్రతిపాదనను అంగీకరించేముందు ప్రభుత్వం ఈక్రింది వాస్తవాన్ని గమనించాలి- సింగపూర్, మలేషియా వంటి చిన్నదేశాలు సైతం (కారణాలు ఏవైనప్పటికీ) స్టార్ టీవీ ప్రసారాల సంకేతాల్ని పంపుతున్న ఆసియాసేట్ ఉపగ్రహం నుండి వెలువడే సంకేతాల్ని గ్రహించే శక్తి వున్న ఏంటెన్నాలను తొలగించటమో, వాటి దిశను మార్చటమో చేస్తున్నాయి. అంతేకాక స్టార్‌టీవీ ప్రసారాల్ని గ్రహించే ఏంటెన్నాల ఏర్పాటును నిషేధిస్తూ చట్టం కూడా చేశాయి. మన పాలకులూ ప్రస్తుతం పనిచేస్తున్న డిష్‌ఏంటెన్నాలను తొలగింపజెయ్యాలి. దొంగతనంగా స్టార్ టీవీ ప్రసారాల్ని చూడకుండా నిషేధిస్తూ చట్టం చెయ్యాలి. అయితే- రెవిన్యూకోసం సారా వ్యాపారమూ, విదేశీ మారక ద్రవ్యం కోసం బహుళజాతి సంస్థల పెట్టుబడులను ఆహ్వానించటమూ, తమ తాత్కాలిక పదవీ సుస్థిరతా ప్రయోజనాల కోసం దేశాన్నే తాకట్టు పెట్టేస్తున్న మన పాలకుల నుండి అంతటి బాధ్యతాయుతమైన ఆచరణను

( తరువాయి 22వ పేజీలో )

# చీకట్లో చీకటితో

—పాపినేని శివశంకర్

అదాటుగా ఒక సూర్యుడు తెగి రాలి పడతాడు
విషాద సంధ్యా వేణువులోంచి శోకగీతం నేలపై ఒలుకుతుంది
అదృశ్య బృహన్నేత్రం మూగగా రోదిస్తుంది
మనమంతా శరీరాల్నీ ఆలోచనల్నీ తడుముకుంటూ
దార్లూ వేర్లూ వెదుక్కుంటూ
ఇలా
చిక్కని చీకటి వెన్నులో వెచ్చని అలజడి
మన దేహం పట్ల మనకే సందేహం
అనుమానం లేదు ఇప్పుడు ముక్కలైన దృశ్యం వాస్తవమే
రాత్రిలో పొంచిన రాతియుగం రాక్షసుడూ వాస్తవమే

అప్పుడప్పుడు మనం చీకట్లోనే మాట్లాడాలి
మిత్రుల్నీ శత్రువుల్నీ గబ్బిలం సంకేతాల్తో తాకాలి
సరికొత్త రేడియం లిపిని కనుక్కోవాలి
నిజానికి, చీకట్లోనే మనిషి స్పష్టమవుతాడు
అర్జునులూ ఉత్తరులూ అప్పుడే రూపొందుతారు
భయాల మధ్య విధ్వంసాల మధ్య నిరంకుశ విరాట్ పాదాల మధ్య
చీమలు ఏనుగు లవుతాయి
మనుషులు వీరులవుతారు
ఎందరు సూర్యుళ్లు రాలిపడలేదని
ఎన్ని మంచు యుగాలిక్కడ గడవలేదని
ఎన్ని కన్నెత్తుటి బొట్లు ఈ గోళం రాల్చలేదని
దిగులెందుకు అవిచ్ఛిన్న విశ్వాసమూ వాస్తవమే
ప్రయత్నం నుంచి ప్రయత్నానికి ప్రస్థానం వాస్తవమే
ఎన్ని రాక్షస రూపాలిక్కడ భూస్థాపితం కాలేదని

అప్పుడప్పుడు మనకి భయపడని స్వప్నం తోడుకావాలి
జ్వాలా తరంగం ఒకటి మనలోంచి వెలువడాలి

---



---




# విజయనగరం "వెలుగు" అందించిన రెండు పుస్తకాలు

సమీక్షకులు : ఛాయరాజ్

## 1. అవసరాల రచన "మన గురజాడ"

"రంగురంగుల ఇంద్రధనస్సులను, తారలను, కాంతిని ఆంధ్ర "కవితా గగన వీధికి అవతరింపజేసిన మహాకవి జననతేదీ చాలామహత్తరమైనది! నవంబరు 30 ! ఈ తేదీ ఎంత విచిత్రమయినది ! మహాకవి జననమూ, నిర్యాణమూ ఇదేనెల. ఇదేతేదీ! ఒక్క సంవత్సరాలలోనే వున్న తేడా! జననం 1861; నిర్యాణం 1915." అంటూ మన గురజాడ రచనను ముగిస్తారు అవసరాల. అవసరాల సూర్యారావు గురజాడ నిర్యాణం చెందిన తరువాత 13 సంవత్సరాలకు అంటే 1923లో పుట్టారు. విజయనగరం మహారాజా కళాశాలలోనే చదువుకొన్నారు. కమ్యూనిస్టులు పట్టించుకున్నదాకా గురజాడను ఎవరూ గుర్తించలేదు. కమ్యూనిస్టు కూడా పట్టించుకొనేందుకు అవసరాల ఎంతో తోడ్పడ్డారు. గందరగోళంగావున్న గురజాడ రచనలను స్వీకరించి, పరిష్కరించి విశాలాంధ్ర ప్రచురణాలయానికి అందించారు అవసరాల. ఈనాడు గురజాడ రచనలలో కొన్నయినా మనం సరిగా చూడగలుగుతున్నామంటే, ఆగొప్పతనం అవసరాలదే. ఎందరో అవసరాలమీద "హేయమైన" దాడి చేశారు. గురజాడ రచనల పరిష్కర్తగా అవసరాలను గుర్తించ నిరాకరించి తెరవెనుకకు నెట్టివేశారు. కవిగా, రచయితగా, నాటకరచయితగా, అనువాదకునిగా, పత్రికా సంపాదకునిగా ఎనలేని సాహిత్యసేవ చేశారు అవసరాల. గురజాడ గురించి సంక్షిప్తంగా, సమగ్రంగా, ఎంతో సరళమైన తెలుగులో రాసిన అవసరాల "మనగురజాడ" వ్యాసమంత ప్రామాణికమైన రచన యేదీ మరొకటి లేదనే చెప్పాలి. 1954లో ప్రథమ ముద్రణను పొందిన "మనగురజాడ" పరిశోధకులకు కనుమరుగయ్యింది. మళ్ళీ ఈనాడు కన్యాశుల్కం నూరేళ్ళ పండుగ ఆహ్వాన సంఘం ఈ రచనను పునర్ముద్రించింది. ఈ చారిత్రాత్మక రచనను పునర్ముద్రించడంలో ప్రచురణకర్తలు ఏ మాత్రమూ శ్రద్ధ వహించలేదు. అట్ట తెరిచి లోపల చూస్తే అన్ని ముద్రారాక్షసాలే! కాయితం బాగులేదు. అక్షరాలు బాగా లేవు, అచ్చు బాగాలేదు! అవును అదేమిటో! అవసరాల అంటే అందరికీ అలుసే కాబోలు !

[మనగురజాడ, రచన : అవసరాల, పేజీలు 31. వెల : అమూల్యం. దొరుకు చోటు : వెలుగు, ఓల్డు రైల్వేకాలనీ, విజయనగరం.]

## 2. కన్యాశుల్కం టీకా టిప్పణి

దేశంలోనూ ప్రపంచసాహిత్యరంగంలోను గొప్ప రచనగా పేర్కొనబడుతున్న "కన్యాశుల్కం" ప్రజల వాడుక భాషలో రాయబడింది. ముఖ్యంగా ఉత్తరాంధ్ర ప్రజల మాండలిక భాషను పాత్రోచితంగా వాడడం జరిగింది. ఆంధ్ర నాట వాడుకభాషోద్యమం తన కర్తవ్య నిర్వహణలో మొదటగా గురజాడచేత కన్యాశుల్కం రాయించింది. ఈ రచనను దేశంలో తెలుగు వారందరూ చదివి అర్థం చేసుకోవడానికి అనుకూలంగా మాండలిక పదాలనేకాక కొన్ని ఇంగ్లీషుపదాల నానుడులకు అర్థాలు తెలియవలసిన అవసరం వుంది. కన్యాశుల్కం మొదటి కూర్పుకు బంగోరె టీకారాసి ప్రకటించారు. కన్యాశుల్కం రెండవకూర్పు సమగ్రమైనది. ఇప్పుడు ఈ రెండవ కూర్పుకు కె. వి. ఆర్. గారు టీకా టిప్పణి విడుదలచేసి ఎంతో మేలుచేశారు. ఈ రచన గురజాడపై పరిశోధనా రచనలరాశిని పెంచింది. అయితే తన రచనకు తొలిపలుకు రాస్తూ "తనకే ఆ సంకల్పం కలిగిందో, లేక ఈ నా పని మీద కన్నుపడి ప్రేరణ కలిగిందో ఏమోగాని, బంగోరె మొదట కన్యాశుల్కం నాటకానికి సమగ్రంగా టీకా తయారుచేసి, నాటక పాఠంతోసహా పుస్తకరూపంలో ప్రకటించారు. దానితో నేను చేస్తూ వచ్చిన పని ఆగిపోయింది." అంటూ కె.వి.ఆర్ బంగోరె మీద ఆరోపణ చేశారు. చదివే వారిని గందరగోళపరచకుండా వివరంగా వివాదాస్పద విషయాన్ని తెలియజేస్తే బాగుండేది. ఇన్నాళ్ళకు తన రచనను ప్రకటించి, ఇప్పుడులేని బంగోరె మీద ఆధారంచూపని ఆరోపణ చేయడం సబబుకాదు.

కన్యాశుల్కం నూరేళ్ళపండుగ సారధ్య సంఘం తరపున వెలుగు సంస ఈ రచనను ప్రచురించినందుకు అభినందనలు.

[కన్యాశుల్కం (టీకాటిప్పణి), రచన : కె. వి. ఆర్. పేజీలు : 56, వెల : రు 5 దొరుకుచోటు : రామినాయుడు, వెలుగు Q. NO. Elc 28, రైల్వే ఓల్డు కాలనీ, విజయ నగరం]

---

( 19 వ పేజీ తరువాయి )

ఆశించటం దురాశే కాగలదు. కాబట్టి ఆర్థిక సామ్రాజ్యవాదము, రాజకీయ సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పోరాటం జరుపుతున్నట్లే- నీచ, హీన విలువల్ని వ్యాపింపజేస్తున్న సాంస్కృతిక సామ్రాజ్యవాదాన్నికూడా మనమే వ్యతిరేకించాలి. మన సాహితీ, సాంస్కృతిక సంస్థలు యిప్పటికే తమ ప్రణాళికల్లో ఈ అంశాన్ని కూడా చేర్చుకున్నాయి. స్టార్ టీవి సంస్కృతినీ, ప్రసారసాధనాలపై పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దేశాల గుత్తాధిపత్యాన్నీ, ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యటం ద్వారా ఎండగట్టాలి.

[ఇలస్ట్రేటెడ్ వీక్లీలో ప్రచురించిన వ్యాసంలోని సమాచారం ఈ వ్యాస రచనలో ఉపయోగించుకోవటం జరిగింది — రచయిత]

జనం పాట :

# వద్దుర బాబు సారా

-కె. వి. పతి

వద్దుర బాబు సార, తాగొద్దుర బాబు సార
నీయిల్లు, వళ్ళు, గుల్లవుతుంది ॥వదుర॥
కల్లుపూని కళ్ళు తెరవమని,
గాంధిగారు నాడు చెబితే,
కల్లు సారా ఫుల్లుగా తాగని
సర్కారోళ్ళు నేడు చెబుతున్నరు ॥వద్దుర॥

గాంధీ మార్కు పెద్దలమంటు,
బ్రాంది సార నీకు పోయించి,
నిన్ను సార మత్తులో ముంచి,
ఓట్లు గుంజి గద్దె లెక్కుతున్నరు ॥వద్దుర॥

మంచినీళ్ళు బాబోయి అన్నా,
మాట వినరు సర్కారోళ్ళు,
కొంపలార్పటానికి పెడతారు
సందు సందుకు సారాయి కొట్లు ॥వద్దుర॥

బడులే లేని పల్లె లున్నాయి,
ఆసుపత్రుల్లేని ఊళ్ళున్నాయి,
జనంసొమ్ము దోచుకునేందుకు
ప్రతి గ్రామంలో ఉంటుంది సారాయి !వద్దుర॥

పనులిమ్మంటే పట్టించుకోరు,
అకలంటె ఆసలే వినరు,
సారావద్దు బాబోయి అన్నావ
తన్నైనా తాగిస్తారు పోలీసులు ॥వద్దుర॥

పొద్దంతా చాకిరి చేస్తావు,
సందేళయితే సారాయి పోస్తావు,
సంసారం గడిచేదెట్లని
అడిగితె పెళ్ళాన్ని చితకబాదుతావు ॥వద్దుర॥

మత్తునుంచి మనసు మళ్ళించు,
మనిషిలాగ ఆలోచించు,

(తరువాయి 25వ పేజీలో)

# బాబూ! ఇక లాగలేను!

**—గోపరాజు నారాయణ రావు**



ఒక వర్గం సమ్మె కట్టగా, మరో వర్గం పనికి హాజరైనట్టుంది- స్ట్రీట్ లైట్ల వరస, తక్కువగా వెలుగుతున్నాయి. ఎక్కువలైట్లు విశ్రాంతి తీసుకుంటూ, చీకటిని ప్రోత్సహిస్తున్నాయి. దారి చాల భాగం చీకట్లోనే వుంది. మధ్య మధ్య మసక వెలుతురు బద్ధకంగా పరుచుకుని వుంది.

దేశవాళీ మధువు సాయంతో ఆ చీకటి చిరువెలుగులలో నుంచి రిక్షా తొక్కుకొస్తున్నాడు చంద్రిగాడు. లోకంలోని యావత్తు మొండితనం తన మీదే వున్నట్లు రిక్షా నడుస్తోంది. రిక్షా నుంచి వేరైపో తలచినట్టు చక్రాలు గర గర శబ్దం చేస్తున్నాయి. మేమూ విముక్తి పొందదలిచామన్నట్టు చక్రాల్లో చువ్వలు కూడా లబ లబ కొట్టుమిట్టాడుతున్నాయి. చోదకుడు చంద్రిగాడు మాత్రం వాటినేం పట్టించుకోడంలేదు. శక్తంతా కూడదీసుకుని రిక్షా తొక్కుకొస్తున్నాడు. ఆగి ఆగి వినోదం కోసం కాబోలు ఏదో పౌరాణిక నాటకంలోని పద్యాన్ని రాగయుక్తంగా పాడదలచి బిగ్గరగా గొంతెత్తుతున్నాడు.

అయితే, గొంతు ఏ మాత్రం అతనికి సహకరించడంలేదు. సరికదా, రాగాలకి బదులు భయంకరమైన దగ్గు తెరలని వెలువరిస్తోంది. రేకు చాటలో గాజు పెంకులు చెరిగినట్టు ఒళ్ళు గగుర్పొడిచే దగ్గు!

బాగా చిక్కబడింది చీకటి.

చిన్నా చితకా వాహనాలు రాకపోకలు తగ్గించేసాయి. 'కళ్ళు మూసుకుని దూసుకెళ్ళడం మా జన్మహక్కు. కళ్ళు తెరుచుకుని నడుస్తూ కూడా మా చక్రాల కింద పడి చస్తే, అందుకు మా పూచీ ఏం లేదు' అన్నట్టుగా లారీలు మాత్రం 'జర జర' మంటూ జెట్ స్పీడుతో వెళుతున్నాయి.

దగ్గుతో రాజీపడి, పద్య పఠనాన్ని విరమించేసిన చంద్రిగాడు హఠాత్తుగా ఓ పొలికేక పెట్టాడు.

"ఏవండో! స్సెంకరయ్యగారు:" అని రిక్షా వెనకాలే సైకిళ్ళమీద ఫాలో అవుతూ, పోలీస్ సీతారాముడికి ప్రొఫెషనోపనిషత్ బోధిస్తున్న కానిస్టేబుల్ శంకరయ్య దాదాపు తుళ్ళిపడ్డాడు ఆ కేకకి. మనిషి భయపడ్డానికి కారణాలు సవాలక్ష వుంటే

వుండొచ్చు. ఖాకీబట్టల్లో ఢక్కా మొక్కీలు తిన్న శంకరయ్య వంటివాడు, ఇక్కడ భయపడడానికి రెండే రెండు కారణాలున్నాయి. కథలో బేతాళుడి శవం మాయమై చెట్టెక్కిందట. అలాగే తాము శ్రమించి తెస్తున్న శవం కాస్తా, చంద్రిగాడి రిక్షా సౌఖ్యం భరించలేక, రోడ్డెక్కేసిందేమోనన్నది మొదటి భయం. ఆ భయమే అనుమానంగా అవతరించి లాఠీ దెబ్బలా తగిలింది శంకరయ్యకి. అందుకే ఒక్క ఉదుటున సైకిల్ ని రిక్షా పక్కకి దూకించి, టార్చి వేసి బాటీలోకి చూశాడు. టౌను శివార్లలో సాధువుల మండపం వెనకాలున్న పాత బావి దగ్గర మున్సిపాలిటీవాళ్ళు కట్టి రిక్షాలో ఎలా పెట్టారో, తెల్లటి గుడ్డల్లో అలాగే భద్రంగా వుంది శవం.

ఇక రెండో భయానికి హేతువేమిటంటే- రాత్రి ఎనిమిది గంటల వేళ, చంద్రిగాడు సడెన్ గా మూడ్ మార్చేసుకుని, "బాబూ! ఇగ లాగలేను బాబూ! శ్సంకరయ్యగారూ ఇగ నన్ను ఈ పనికి పిలొద్దు" అంటూ శోకాలు మొదలెడతాడేమోనని. అయితే చంద్రిగాడు ఆ మూడ్ లో లేడని, నాటుసరుకు ఇంకా ఉరకలేస్తోందని మరుక్షణం తనే వాడి మాటలని బట్టి గ్రహించేశారు శంకరయ్యగారు. రెండో భయం కూడా లేనందుకు సంతోషించారు. ఆ రోజు మధ్యాహ్నమే ఓ ఆడ మనిషి ఆ పాడుబడ్డ బావిలో దూకి ప్రాణాలు తీసుకుంది. పోస్టుమార్టం కోసం శవాన్ని తీసుకువెళుతున్నారు. పద్యపఠన కాలక్షేపం కూడా లేని చంద్రిగాడు ఏమీ తోచక, ఆ కేసు వివరాలు కూపీ లాగడానికి శంకరయ్యని పిలిచాడు అర్జెంటుగా.

"ఇంతకీ, ఈ మనిసెందుకు దూకి సచ్చిందంట ? కట్నం కేసా? పేవుల యవ్వారమా ? ఇయేం కాకపోతే మానభంగం.... అదే రేప్ కేసా ?" చిన్నగా రొప్పుతూ ముద్ద ముద్దగా ప్రశ్నించాడు చంద్రిగాడు.

---

నువ్వు తాగేది సారా కాదు ( 23వ పేజీ తరువాయి )
ఆకలంటు ఏడ్చె పిల్లల కన్నీరు ॥వద్దురా॥

సంసారాలు కూల్చేసేటి,
సారాకు వ్యతిరేకంగా,
పోరాడే అక్కలకు,
అండగ ఉండండి- చేయూత నివ్వండి.
వద్దుర బాబు సార,
నువు పోరాటాల దారి నడవరా! ...

[సిటీ సర్వీసు బస్సు, బలె చిత్రంగుంది చూడోలప్పా! ...కాకినాడ పై 9వేటు క్యాసెట్ -హాస్యగీతపు బాణీ]

చిర్రెత్తిపోయింది శంకరయ్యకి. "నీ ముండమోపి డొల్లు పక్కనెట్టి స్పీడు పెంచరా ఎదవ నాకొడకా! అరమైళ్ళ వారం రోజులు తొక్కేలాగున్నావ్. అసలే లేటు" అని అరిచేశాడు. పట్టు వీడలేదు చంద్రిగాడు.

"మరీ.... ఎఫైయారులో ఏంరాశారండి?" తరచు పోలీసులతో మూవ్ కావడంతో వారి భాష చంద్రిగాడు కూడా కొంచెం అలవర్చుకున్నాడు.

"చంద్రిగాడని, ఓ రిక్షా నా కొడుకు దాన్ని చంపి బావిలో పార్నూకాడని రాసారా! చాలా!" రిక్షాకి మరో వైపున ఫాలో అవుతున్న సీతారాముడు అన్నాడు వ్యంగ్యంగా. వ్యంగ్య బాణం చిన్నదే. అయితే చంద్రిగాడిలో అది హుషారుని ఉప్పొంగించేసింది. సినిమాల్లో రాక్షస పాత్రలా నవ్వబోయాడు. అయితే అది పెద్ద దగ్గు తెరగా తర్జుమా అయిపోయి, ఖాకీలిద్దరినీ క్షణకాలం జలదరింపచేసింది. దగ్గి అన్నాడు చంద్రిగాడు. నవ్వబోయి, దగ్గుతున్నాడు. మాట్లాడబోయినా దగ్గుతున్నాడు కాని, దగ్గుతూ, నవ్వుతూనే మాట్లాడుతున్నాడు.

"బలేవోరండి సీతారావుఁడుగారూ! నేను మర్డరు సెయ్యడవేంటి చెప్పండి? అఁ! నా చేతిలో పదవుందా? పరపతుందనుకున్నారా? కనీసం లాటీ కర్రయినా లేదు కదండి" మళ్ళీ నవ్వాడు, మళ్ళీ దగ్గాడు.

"ఓర్నా కొడకా! పదవిలో వున్నోళ్ళని అలా ఆడిపోసుకుంటే కళ్ళో తాయిరా చంద్రిగా! కానారే! చిన్న డౌటు. పోలీసోళ్ళ లాఠీకి నిజంగా అంత పవరుందేంట్రా!" అడిగాడు పోలీస్ సీతారాముడు.

"ఛా.... నిజవాఁ అని అడుగుతారేటండి! కితం జన్మలో వొఁజ్రాయుదవేఁ ఈ కలియుఁగంలో లాఠీగా జనిమించింది. అసలు లాఠీ మయిమ ఎలాంటిదో చెప్పాలంటే భారతవంతవుద్ది" అన్నాడు చంద్రిగాడు. పోలీసులు ఆ మాటలకి నవ్వుకున్నారు. తరవాత శంకరయ్యే మళ్ళీ తిరగేశాడు.

"ఏటి! నిజంగా అంత మయిముందంట్రా మన లాఠీకి?"

"తమరి చేతిలో వుండే ఆ లాఠీ క్రితం జన్మలో మాయల మరాఠోడి మంత్ర దండం అనికూడా నిక్కచ్చిగా చెప్పవచ్చు. ఎలాగంటారా!? కాఫీ కొట్టోడు తమర్ని చూడగానే దయసేయండంటాడు. కూకోబెట్టి తిన్నంత టిపిను. తాగినంత కాఫీ పోస్తాడు. ఎంచేత? రోడ్డు పక్క పకోడి వాల్లు తమరి దర్శనం అయితేచాలు, అడక్కుండానే వేడివేడీ మిరపకాయ బజ్జీలు వాయివాయి మీకు చెల్లించేసుకుంటారు ఎంచేత నంటారు. సినిమా ఆలోడు ఊర్కె చూపిస్తాడు—బొమ్మ. పండుగలకి సావుకార్లు మీరెల్లేసరికే మామూళ్ళ రెడీగా అమిర్చి వుంచుతారు. ఎంచేతంటారు? అదన్నమాట తమరి లాఠీ మయిమ. ఆఖరికి మన బోసినోరు హెడ్‌గారు కనిపిస్తే

ఎక్కడలేని లంజలూ, వొచ్చావా నవమన్మదుణా! అన్నట్టు ఎందుకు వచ్చి వాల్తారు. ఆడు ఆరువేస్తాడని తెలిసినా, డబ్బులు ఇచ్చే బేరం కాదని తెలిసినా ఆడెంటే ఎందుకు గుడిసిల్లో దూరతారు ? అదే లాటీ మయిమే!" అదేదో తాయెత్తు మహిమ న్నంత అబ్బురంగా చెప్పాడు చంద్రిగాడు. కిసుక్కు, కిసుక్కున నవ్వాడు.

'మోత' డ్యూటీ తగిలినపుడు వాళ్ళ మధ్య ఇది మామూలే. కిక్కులో వుండే చంద్రిగాడిచేత తాగించి వాదించడం పరిపాటే. ముతక వ్యాఖ్యానాలకి, వెగటు సంగతులకి తప్ప మరే విషయానికి చోటుండదప్పుడు. అందుకే పోలీసులు కోపగించుకోరు. సరికదా, మరింత రెచ్చగొడతారు. అందుకే సైకిల్ బ్రేక్ వేసి, ఒక కాలు నేలకు ఆన్చి అన్నాడు శంకరయ్య—"ఈడు చాలా ముదిరాడయ్యా ! ఇంటన్నావా సీతారావుఁడూ! చెప్పరా నాకొడకా! ఇనవయ్యా ఈ లెక్చరు" ఆర్డరేశాడు శంకరయ్య.

"ఏదో సామెత చెప్పినట్టు- పొలిటికల్ లీడర్లని, పోలీసుల్ని చూస్తే ప్రతి బేవార్సు నాయాలుకి వెంగ్యం పొంగుకొచ్చేస్తది. ఇక పోలీసోళ్ళని ఏకి పారెయ్య మంటే చూస్కో-మరి- గోదారొరదే" అన్నాడు సీతారాముడు.

"కాని, పాయింటేమిటంటే - చంద్రిగాడు కూడా పోలీసుల్ని, పొలిటిక్స్ లీడర్లని ఇమర్శించే వోడయ్యాడు. ఇదిగో సీతారావుఁడు! సమయం వొచ్చిందిగాబట్టి చెబుతున్నా. ఈమాటిను. అసలు డిమోక్రెసీలో వున్న జబ్బయ్యాయిదంతా. ప్రెతి పనికిమాలిన నాకొడుక్కి గెవర్మెంటు అలుసిచ్చేస్తది. ఆ నాకొడుకులు- అదేంటి ఆఁ వాక్ సొతంత్రం అంటూ ఊరంత నోరెట్టుకుని, ఇదిగో దరికేం కదా తక్కువగా, మనమీద పడిపోతుంటారు. నేను చంద్రిగాడి గురించి చెప్పడం లేదు. జెనరల్‌గా చెబుతున్నాను. చెప్పొచ్చేదేవిఁటంటే డిమోక్రెసీలో గెవర్మెంటు అలుసు తీసుకొని పోలీసోళ్ళని ఆడిపోసుకోవడం మామూలే" అని తేల్చాడు శంకరయ్య.

"బీదరుపులెందుకు స్సెంకరయగారో! అదేంటి....? ఆఁ బూర్జా గెవర్మెంటో, దర్జా గెవర్మెంటో మీమీద ఈగను కూడా వాల్నిదంట. గెవర్మెంటోడికేకాదు, కడా కరికి, మీక్కూడా ఏ నాకొడుకేనా ఎదురుమాట్లాడేడో లక్ష్మీకొడుకుని టుపు..టుపు కాల్చీ మని తుపాకులు ఇచ్చిందంట. మొన్న గాంధీబొమ్మ కాడ మైకాలో స్పీచిచ్చాడు చూడండి—ఆడు చెప్పాడు." అని వివరించాడు చంద్రిగాడు.

తాపీగా పరిగెడుతోంది రిక్షా (లేకపోతే పరిగెట్టినట్టు కనిపిస్తోంది.) దాని స్పీడుకు తగ్గట్టు అటుపక్క సీతారాముడు ఇటుపక్క శంకరయ్య సైకిళ్ళు తొక్కు తున్నారు.

"అదయ్యా సీతారావుఁడు! ఇందాకా నేన్నది అలాంటి పనీపాటా లేనోళ్ళ గురించే అయినా ఆడిదేం తప్పు? ఇనేసి, అది నమ్మే ఇలాంటి గొర్రె లుంటే ఆడేమైనా చెబుతాడు. ఏవంటావు." నిష్ఠూరంగా అన్నాడు శంకరయ్య.

"నిజమేనండి సెంకరయ్యగారు! సీతికి పొలిటికల్ లీడర్లని, నిజాయితీకి పోలీసోళ్ళని నమ్ముకుంటే ఈ దేసం ఎప్పుడో బాగుపడిపోయేది. సత్తె ప్రెమాణకంగా నేనూ అదే అంటున్నాను." అని కిసుక్కున నవ్వాడు చంద్రిగాడు.

"ఇగనేం. చాలా అడ్వాన్సయిపోయాడు." శంకరయ్య బోల్డు ఆశ్చర్యం ప్రకటిస్తూ అన్నాడు.

"బొక్కలేసి మక్కెలు ఇరగదంతే ...." సీతారావుడు నవ్వుతూ అన్నాడు. టక్కున అందుకున్నాడు చంద్రిగాడు.

"ఆమాటంటే గుర్తొచ్చింది. లాకప్ సావు పూర్తిసేసిన గెనత మన జేషినికి ఏప్పుడొస్తదండి!"

"ఆ గెనతలో నీకూ వాటాకావాలంటే చెప్పరా! రేపే ఏసేత్తాను లాకప్పులో" చిరుకోపం నటిస్తూ హెచ్చరించాడు సీతారాముడు.

"ప్లాను బాగుందయ్యా! నిజమే ఈడికి, ఈడితోపాటు మనకూడా అంతో ఇంతో తీరొస్తంది. కానీ చంద్రిగాడొద్దులే. అసలే ఆడిపెళ్ళాం జబ్బుమనిషి. దానికి ఈ ముద్దకూడా లేకుండా చేసెయ్యడం ఏం ధర్మం చెప్పు ..." ఏవేవో అంటున్నాడు శంకరయ్య.

జబ్బుపెళ్ళాం ప్రస్తావన రాగానే గుండెల్లో వేడి ఆవిరి చిమ్మినట్టయింది చంద్రిగాడికి.. బ్రేకువెయ్యకుండానే రిక్షావేగం తగ్గిపోయింది. ఆ క్షణంలో మనసులో లక్ష తిట్టాడు పెళ్ళాన్ని. మరుక్షణంలోనే, పూరిపాకలో ఒంటరిగా కటిక నేలమీద కడుపునొప్పితో గిలగిలతన్నుకునే "ఎర్రినాగంగి" కళ్ళముందు కదలడంతో చల్లబడిపోయాడు. ఒళ్ళంతా నిస్సత్తువ కమ్ముకోడం ప్రారంభించింది.

గుడిసెకెల్లి మూడురోజులైంది. సాధువుల మండపం అవతల మురికివాడలోనే తన గుడిసెవుంది. శవం లోడింగుకి వెళ్ళే ముందు ఓసారి చూసైనా రావల్సింది. కదా! అనిపించింది. అసలు ఆ ఉద్దేశంతోనే తను స్టాండు నుంచి బయలుదేరాడు. అయితే చేతిలో వున్న అడ్వాన్సు బాపతు సొమ్ము సరాసరి సారా కొట్టుకు లాక్కెళ్ళింది. ఇంటికి వెళితే గంగమ్మ రెచ్చిపోయి, 'నే సచ్చేదాకా ఈ శవాలమోత మానవురా' అంటూ పాతపాటతో మూడ్ అంతా ఖరాబు చేసేయ్‌గలదని భయపడి వెళ్ళడం మానేశాడు. మూడురోజుల క్రితం ఈ విషయంమీద పెద్ద గొడవై పోయింది.

ఆ మున్సిపాలిటి ఏరియాలో దిక్కులేని శవాలకి చంద్రిగాడి రిక్షాయే దిక్కు. ప్రమాదాలలో చచ్చిన వాళ్ళ శవాలకి, హత్యలు, ఆత్మహత్యల కేసులకి కూడా వాటి మోతకి చంద్రిగాడి రిక్షాయే పోలీసువారికి పర్మినెంట్ వాహనం. పోస్టుమార్టం కోసం ఆరుమైళ్ళ దూరంలో, పక్క టౌన్‌లో వున్న పెద్దాసుపత్రికి ఆ శవాలని

తరలిస్తాడు. ఇందుకుగాను ప్రతి కేసుకి పోలీసులు యాభై రూపాయిలు ఇస్తారు. ఇది రివాజు. ఇందులో ఇరవై ఎడ్వాన్సుగా ఇచ్చేస్తారు. ఎడ్వాన్సు యావత్తు సారా కొట్లో సమర్పించి, పోలీసులు చెప్పినచోటికి రిక్షాతో వెళతాడు చంద్రిగాడు. పని అయిపోగానే మిగిలిన సొమ్ము స్పాట్‌లో పేమెంట్ అయిపోతుంది. అవి అందగానే మళ్ళీ నిషా స్వర్గంలోకి వెళ్ళిపోతాడు. ఆ మత్తు దిగేటప్పటికి కాస్త అటు ఇటుగా ఇంకో కేసు రెడీ!

అయితే, ఈ బిజినెస్‌వల్ల - బతుకుతున్న జనులంతా చంద్రిగాడి రిక్షాని బహిష్కరించేశారు. అయిదారేళ్ళ క్రితమే దానికి పీనుగుల బండి అని బిరుదు కూడా ప్రదానం చేశారు. పోలీసుల బలవంతం వల్లనో, కాకపోతే తన బలహీనత బలవంతంవల్లనో చంద్రిగాడు ఈ మోత పనికి పరిమితమైపోయాడో ఇప్పుడు చెప్పడం కష్టం. చంద్రిగాడి రిక్షా కూడా ప్రజలిచ్చిన బిరుదుకు తగ్గట్టే వుంటుంది. బాడీకి వెలువల తాపడం చేయించిన టీనారేకు ఊడిపోయి, చెక్కలన్నీ బయట పడ్డాయి. రిక్షా మొత్తంమీద నికిల్ కోటింగ్ మచ్చుకైనా కనిపించదు. అంతా తుప్పు. గూడు తుపాను దెబ్బతిన్న పూరి పాకలాగే వుంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ రిక్షా, చక్రాలమీద పేర్చిన చితిలా వుంటుంది. ఎప్పుడూ తాగి, హ్యాండిల్ మీదకి కాళ్ళు పారజాపి పడుకుని వుండే చంద్రిగాడు - ఆ చితిమీద పెట్టిన శవంలాగ కనిపిస్తాడు.

"ఈడి సంగతి చెప్పేదేవుంది. అది కూడా తిరుగుబోతే అయుంటది" సీతారాముడి వ్యాఖ్య.

"లేకపోతే వూరికే తగిలేస్తాయా అలాంటి జబ్బులు?" శంకరయ్య సమర్థన.

తనమీద, తన పరిస్థితిమీద జోకులు పేల్తున్నాయి, అవి తొడలో దూరిన బుల్లెట్లలా చంద్రిగాడిని బాధిస్తున్నాయి.

"స్సెంకరయ్యగారూ! నామీద దయుంచి ఈ శవాలమోతకి ఇగ నన్ను పిలవమాకండి. ఇగ నేను లాగలేను" గుండెలో బాధని, గొంతులో మత్తుని మేళవించుకుని, నిశ్చలంగా వెలువడిన ఆ మాటలకి పోలీసుల నోళ్ళు ఒక్కసారే మూతపడ్డాయి. ఆ మాటల్లోని దైన్యం ఖాకీ బట్టల వెనుక వున్న గుండెని తాకకపోలేదు. అయితే ఇదే మాట చంద్రిగాడు గత ఆరు మాసాలుగా అంటున్నాడు. అందుకే మనం వెలుతురులో ఇద్దరూ ఒకర్ని చూసి ఒకరు నవ్వుకున్నారు. కానీ, ఆపై పరాచకాలు ఆడ్డానికి మాత్రం వాళ్ళకి మనస్కరించలేదు. అందుకే ఓదార్పుగా అన్నాడు

"సర్లే! అన్నట్లు నాల్రోజుల క్రితం మీ ఆడదానికి బాగాలేదన్నావురా! ఇప్పుడు నెమ్మదించిందా?"

"ఒహాపే నెమ్మదించడం! బాబూ! ఈ శవాల మోత నావల్లగాదు. ఇగ లాగ లేను." మళ్ళీ చెప్పాడు చంద్రిగాడు.

"దానికీ, దీనికి ఏంట్రా సంబంధం?" లాలింపుగానే అడిగాడు శంకరయ్య.

క్షణం మౌనం. తరువాత నెమ్మదిగా నిట్టూర్చి అన్నాడు చంద్రిగాడు.

"నేను మోసిన పీనుగులన్నీ దెయ్యాలయిపోయి, మా గుడిసె పట్టుకు యాలాడతన్నాయని మా గంగమ్మ భయం. బెంగ, మా బతుకు స్మెసానం అయి పోడానికి, దాని కడుపు బాధకీ కూడా, నా శవాల మోతే కారణమని దాని నమ్మకం. రెండు మాసాలనుంచి దాని గోల పడలేకుండా వున్నాను. ఈ శవాలమోత మానక పోతే, ఏదైనా మింగి సత్తాను. దాంతో నాకడుబ్బాద కూడా నాకు ఇరగడైపోతదని ఈరంగం ఆడతన్నాది. ఈ దయిద్రప్పని మానేసి, ఇంకో వూరెలి పోదాం అడుక్కు-నయినా ముద్ద తిందాం గాని, ఈ ముదనష్టపు కూడు తనకొద్దని ఒహాటే గోల. దాని బాద దాన్దిలెండి. పుట్టిన ఒక్కడూ దేసాలట్టిపోయాడు." ఎప్పుడు దిగిపోయాడో. దిగి ఒక్కొక్కమాటే రొప్పుతూ చెబుతూ, భారంగా రిక్షా లాగుతున్నాడు చంద్రి గాడు.

"నిజవండీ! ఇగ నేను లాగలేను. ఇదే చివరి పీనుగ" అంటూ రోడ్డు మధ్యకు వెళ్ళాడు.

"దీనికింత ఇదై పోతావేంట్రా! ఈ పని పూర్తిచేసి, మళ్ళీ పొద్దున్నే మీ ఆడ దాన్ని తీసుకుని పెద్దాసుపత్రికి రా. రికమండేషన్ చేసి మందులిప్పిస్తాను" అన్నాడు శంకరయ్య.

మాట్లాడకుండా రిక్షా లాక్కెళుతున్నాడు చంద్రిగాడు. ఎదురుగా వున్న మలుపు నుంచి సర్రున దూసుకొచ్చిందో లారీ. అయితే హెడ్లైట్ల వెలుగులో కన బడిన పోలీస్ టోపీలు చూసి స్లోచేసుకుని, వినయంగా నిష్క్రమించింది.

"ఈ లారీ నాకొడుకులు..." శంకరయ్య ఏదో అనబోతుండగానే అదే మలుపునుంచి మరో లారీ సర్రుమని వచ్చేసింది యమ స్పీడుతో. రిక్షాతో సరిగ్గా రోడు మధ్యలో నడుస్తున్నాడు. ఇందాకటి లారీలా ఇది పోలీస్ టోపీల పట్ల వినయంగా లేనట్టుంది. అదే స్పీడుతో దూసుకొస్తున్నది. శంకరయ్య గట్టిగా అరిచాడు," ఒరేయ్ చంద్రిగా. తాగుబోతెదవ! పక్కకి లాగించు. ఒరేయ్ చంద్రిగా. నిన్నేరా!" వినేస్థితిలో లేడు చంద్రిగాడు. లారీ వేగం తగ్గలేదు. సీతారాముడు దభీమని రోడ్డు దిగేసి, జరగబోయేదాన్ని ఊహించుకుని గట్టిగా కళ్ళు మూశాడు. వెంటనే 'అది' జరిగి పోయి వుంటుందేమోనని తిరిచి చూశాడు

ఏదో అద్భుతం జరిగినట్టు సరిగ్గా రిక్షా ముందుకొచ్చి పెద్దశబ్దం చేసుకుంటూ సడెన్‌బ్రేకులో ఆగిపోయింది లారీ. అసలే లారీ డ్రైవర్ - ఆ పై బహుచురుకైన వాడు. అందుకే లారీని వెంటనే రెండో పక్కకి లాగించి తుర్రున వెళ్ళిపోయాడు. ఇదంతా ఇద్దరు పోలీసులు తేరుకునే లోపలే జరిగిపోయింది. ముందుగా తేరుకున్న సీతారాముడు పిచ్చకోపంతో రంకెలేశాడు.

"అంత తాగకపోతే ఏరా లంజా కొడకా! ఇంటికాడ చెప్పొచ్చేసావా! ఎం ట్రుకవాసిలో బతికి బయటపడ్డావు. లేకపోతే నీ శవాన్ని గూడా అందులో ఏసి మేం లాక్కెళ్లాల్సొచ్చేది. నీ రిక్షాకి నీదే ఆఖరి పీనుగయ్యేది." మౌనంగా రిక్షా ఎక్కాడు చంద్రిగాడు.

* * *

నైట్‌వాచ్‌మెన్ ఆసుపత్రి గేటు తెరిచాడు. శక్తంతా కూడదీసుకుని ఒక్క ఉదుటన రిక్షాని గెంటాడు చంద్రిగాడు. రెండడుగులు వేశాడు. పెద్ద దగ్గుతెర, అయినా ఆగకుండా వెళ్ళాడు. క్షయరోగుల వార్డుకి కొంచెం దూరంగా, ఆసుపత్రి ఆవరణలో ఒక మూలగా వుంది పోస్టు మార్టంగది. మొత్తం ఆవరణ మధ్యలో దేదీప్యమానంగా వెలుగుతున్న పెద్దలైటు వెలుగులో ఆగది అస్పష్టంగా కనిపిస్తోంది. దగ్గుని లెక్కచేయకుండా రెండు నిమిషాల్లో గదిముందుకి లాక్కువెళ్ళి నిలబెట్టాడు రిక్షాని. ఊపిరి అందనంత ఆయాసం, వెంటనే గదికి అవతల పక్కవున్న రాతి చప్టా దగ్గరకివెళ్ళి, దానిమీద కూలబడిపోయాడు చంద్రిగాడు. దగ్గు ఆగింది. మెల్లగా మెల్ల మెల్లగా ఏదో లోయలోకి జారిపోతున్నా నా అనిపించింది చంద్రిగాడికి. ఒకటే నీరసం.

ఏమిటిది? తన దగ్గుకి బెదిరిన నిశ్శబ్దం మరింత నిశ్శబ్దంగా మారిపోయిందా? ఈ నిశ్శబ్దాన్ని భరించాలంటేనే ఒళ్ళు జలదరిస్తోంది. శరీరంలో ప్రతి అణువూ అలసిపోయింది. అలసిన అణువులతో శరీరం సొలిపోయింది. నిస్సత్తువ ... నిస్సత్తువ ... మత్తంటే మాయ కాబోలు. కాకపోతే ఏమైపోయిందంతా?. రెండు చుక్కలు. రెండే రెండు చుక్కలు గొంతులో పడితే బావుండును. దాహం, ఈ దాహ మొకటి? అసలు నాకాళ్ళూ చేతులూ నాకేవున్నాయా? వున్నా అధీనంలో వున్నాయా? ఎక్కడా రాలిపడిపోలేదు కదా? దగ్గుతో, అలసటతో శరీరం మొత్తం ఏమీ మిగలకుండా హరించుకు పోయిన అనుభూతి. అవయవాలన్నీ వున్నట్టేనా? ఏమిటి? నామమాత్రంగా కూడా వాటి స్పర్శ అనుభవంలోకి రాదేం? ఆయాసంతో గుండె చేస్తున్న శబ్దంమాత్రం ఆ నిశ్శబ్దంలో కలవరపెడుతోంది. టబ్ ... టబ్ తడిమన్ను ముద్దలు దబ దబ పడుతున్నట్టు కేవలం ఆ శబ్దమే చెవులకి సోకుతోంది. అసలు తను లేడు. తన శరీరమూలేదు. ఒక్కటే, తన గుండె ఒక్కటే ఆ రాతి చప్టా మీదపడి, దీపంలేని గదిలో పసిగుడ్డు వెక్కిళ్ళు పెడుతున్నట్టు కొట్టుకుంటోందా?

ఏవో అనుభవాలు; ఏనాటివో జ్ఞాపకాలు, చల్లని, వెచ్చని స్పర్శల అనుభూతులు - గుండెకింద తారాడుతున్నాయి. మొరటుగా వున్నా, స్త్రీ సహజమైన లావణ్యాన్ని కోల్పోని ఆ రెండు చేతులు దోసిలిగా మారి, పోసిన వెచ్చని నీళ్ళ ధారకింద; పగలంతా లోడురిక్షాలాగడానికి రెక్కలు ముక్కలు చేసుకుని పులిసిపోయిన తన శరీరం ఒదిగిపోయి తడిసినపుడు పొందినప్పటి సౌఖ్యం ?:.... 'ఇంత రాత్రేళదాకా కిరాయి తిరక్కపోతే ఏవోఁ? చూడు మొగం ఎలా పీక్కుపోయిందో' అంటూ తన తలని ఆమె తన రొమ్ములకి అదుముకున్నపుడు పొందిన పారవశ్యం... ఉల్లిపాయల పులుసుతో వేడన్నం తాను ఆబగా తింటున్నపుడు తన ముఖంలో ఆశల పందిరిని వెతుకుతూ, కిరసనాయిలు దీపం వెలుగులో కనిపించిన ఆమె ముఖంలోని నైర్మల్యం .... తరవాత చీకటిలో .... వేడి తగ్గిన నగ్నదేహాలమధ్య మిగిలిపోయిన వేడిస్పర్శ అనుభవించినపుడు .... ఏపూలు దొరికినా సిగనిండా తురుముకుని పొద్దున్నే నిండుగా కనిపించే గంగి .... నల్లగా నిండుగా ముదురాకు పచ్చటి గున్న మామిడిమొక్కలా వుండే గంగ .... రిక్షా బయలుదేరుతుంటే అదృష్టమే ఎదురొచ్చినట్టు రోజూ .... శకునమొచ్చే గంగ .... వెళ్ళిపోతూ .... 'రాత్రికి బేగొస్తానులే' అంటే ముందు విరసంతో 'వొట్టెబద్దాలు' అనేసి తరవాత సిగ్గుతో, వయ్యారంగా క్రీగంట చూసే గంగ .... ఆనాటి తన గంగ ....

ఇప్పుడో .... మూడురోజులనుంచి ఎలావుందో? కడుపునొప్పి ఎలా వుందో? తగ్గివుంటుందా ? అది మొదలైతే తల తెగిన పశువులా గిలగిల తన్నుకునే గంగమ్మ .... ఇంటికి పైసాకూడా పట్టుకెళ్ళని తనని దీనంగా, అసహ్యంగా- అర్థింపుగా చూసే గంగమ్మ .... తనకి అనందాన్ని, జీవితాన్ని పంచిఇచ్చి, తన నుంచి బాధలని, దెబ్బలని చివరికి రోగాలని మాత్రమే పంచుకున్న గంగి .... ఆ రోగాలకి తన రూపాన్ని, ఆరోగ్యాన్ని చిదిమి ఇచ్చేసిన గంగ .... ఒక్కసారి చూడాలి. ఏమిటి ? చూడగలనా ? ఏమిటి ఈ నిస్త్రాణ ? ఈ ప్రాణాలు నిలుస్తాయా .. . ?.

కాలికి తగులుతున్న దూదివుండలని, సెలైన్ గొట్టాలని అసహ్యంగాచూస్తూ, వాటిని దాటుకుంటూ పోస్టుమార్టంగది దగ్గరకు వచ్చాడు డ్యూటీలో వున్న సీనియర్ డాక్టర్. శంకరయ్య టార్చిలైటువేసి దారి చూపించాడు. సీతారాముడి వెనకాల మరో ఇద్దరుకూడా వచ్చారు. వాళ్ళే వచ్చీ రావడంతోనే శవంమీద కప్పిన తెల్లటి గుడ్డను లాగేశారు. దరిద్రం శవంగా మారినట్టుందా శవం. చింకిచీర, తిండిలేక హరాయించుకుపోయిన శరీరం. పాతబావి నీటి బాపతు వాసన ముక్కులకు సోకుతోంది. తడితడిగావుంది శవం. నాచుతో అసహ్యంగా కూడా వుంది.

"దిక్కులేందేవిఁటయ్యా!" సాధారణంగా ప్రశ్నించాడు డాక్టర్. "అలాంటి కేసే" అంతే సాధారణంగా సమాధానం ఇచ్చాడు శంకరయ్య.

( తరువాయి 36వ పేజీలో )

# నీ ఉద్యమం - నవోదయం!

—కొండపల్లి కోటేశ్వరమ్మ

తెల్లదొరలు కల్లు మానండన్న వారిపై కళ్ళెర్ర జేసి
లాఠీల, కొరడాల కొడుతుంటే - తల్లిగ విలపించావు.
పరప్రభుత్వాన్ని ప్రతిఘటించిన వారికి చెల్లిగ చేయూత నిచ్చావు.
జాతి కళ్ళప్పి చూడ జాతీయోద్యమంలో ఓ భాగమైనావు
స్వాతంత్ర్యం సమకూడిందంటే - అంబరమంత సంబరాన జాతీయ గీతం పాడావు.
కల్లుండని కలతలు రానీయని స్వేచ్ఛా భారతి వడి దోలనున్నట్లు ఆడావు.

గాంధీ జీ పేరుతో బ్రాందీ షాపులు వెలిశాయంటే -
మహాత్ముని కలలు కల్లలు-కావని అబద్ధ మన్నావు.
సారాను వారిస్తూ - పోరాటాలు నడుపుతుంటే చూసి నివ్వెర పడ్డావు.
కుత్తుక దాకా నీ భర్తను సారాపోయించి కులపోరాటంలో దింపితే -
మత్తిల తాగించిన నీయన్న మత పోరాటంలో కత్తి దూస్తే -
ఆలయ పోరాటంలో నీ కొడుకు మరణిస్తే -
అహింసా మూర్తి స్మృతిలో కదల విలవిల్లాడుతూ - విలపించావు.

సారాకు బానిసలైన నీవాళ్ళు నిత్యం తాగుతూ, తాగొచ్చి నిన్ను బాధిస్తుంటే -
తాగి - తాగి నీ తమ్ముడు గుండాగి నేల కూలితే -
చాలినంత డబ్బులేక నిన్ను కన్నవారు కల్తీసారా తాగి నురగలు కక్కితే -
నీ సూత్రాన్ని సైతం తాగను నీవాడు లాగుతుంటే -
సహనం చచ్చి కోపం హెచ్చి కొట్టను చేయెత్తావు. పాతివ్రత్యం అడ్డొస్తే దించావు
వారుణ వాహినిగా సారా పొట్లాలు సరఫరా చూసి
మద్యపానీయాల అరాచకాల నుండి నీతికి నీ ఇంటికి భిక్ష మడిగిన కరువని
తెలుసుకున్నావు.

అలసిన ఇల్లాలిని చూడక అలమటించే ఇంటిని చూడక
సూర్యోదయానికి ముందే సారా సాక్షాత్కరించాలనుకునే భర్తను చూసి
సీటును భద్రపరచుకోను ఓటడగ వచ్చినవాడు బాటిల్‌తో ప్రత్యక్షం
కావడం చూసి
ఎన్నికల జాతరలో తాగిన కోలాహలంలా గూండాలు మందిని బాదడం చూసి
మంత్రిగారు ముఖ్య మంత్రిని చేయమని దేశమాతకు సారాభిషేకం
చేయడం చూసి
సారా వాసనల గుభాళింపులో గూండాయిజానికి అధికార కిరీటం
అబ్బడం చూసి

భద్రత లేని దేశాన్ని చూస్తూ - బాధల మునిగిన నిన్ను నీవు చూసుకుంటూ
కుమిలి కుమిలి రగిలావు. క్రోధోద్రేకాల జ్వలించావు.
నిన్నూ, నీ జాతినీ, నీ సంస్కృతినీ కాపాడను నీ శక్తిని సమీకరించావు.
మందబుద్ధికీ, చైతన్యరాహిత్యానికీ మూలమైనదాన్ని నిషేధించమని
ఉద్యమించావు.

నీ ఉద్యమాన్ని చల్లబరచనూ - నీ కన్నీటిని తుడచనూ దరియాప్తు సంఘాన్ని
నియమిస్తుందట ప్రభుత్వం.
తెల్లదొరలే నయమన నల్లవారి ఖాకీలు నిన్ను నానా హింసలు పెట్టి నీపట్టు
సడలచేస్తారట.
స్వాతంత్ర్య, విప్లవ పోరాటాలకు ఊపిరు లూదిన నీవు
సారా కాంట్రాక్టర్లకు, గూండాలకు, వారి తాబేదార్లకు ఖాకీలకు సైతం
అదరక, బెదరక, ఆగక కుహనా రాజకీయాలకు చోటీయక స్వచ్ఛందంగా సాగు.
ఆకాశంలో నీవు సగమన్నది నిజం చేయి.
నీ శక్తి అజేయమనీ, నీవు సబలవనీ రుజువు చేయి.
నిష్కళంక దేశభక్తులు, నిస్వార్థపరులు, నీతిశీలురు
నిరాడంబరంగా... నీ కండగ రావడం తథ్యం! నీదే విజయం!

నీపై నిత్యం జరిగే అత్యాచారాలూ-నిన్నూ నీ మనసునూ హతమార్చే
దురాగతాలూ
ఇంకానా... ఇకపై... సాగవని ఎలుగెత్తి చాటమ్మా!
నీ ఉద్యమం - నవోదయం... నీ మార్గం మంచికి మార్గం
కావాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తుంది - విశాలాంధ్ర!

## సాహిత్య వార్తలు

జన సాహితి ప్రధాన కార్యదర్శి కొత్తపల్లి రవిబాబు, 'నైతిక విప్లవం' సంపాదకుడు ఊదర గోపీచంద్‌గార్లపై ఆంధ్రజ్యోతివారు పెట్టిన పరువు నష్టం కేసు విచారణ విజయవాడలో నవంబరు 20వ తేదీన ప్రారంభమౌతోంది. 'కామోత్సవ్' పై విమర్శనాత్మక వ్యాసం రాసినందుకు రవిబాబు పైనా, ఆ వ్యాసాన్నీ ఇంకా ఇతర వ్యాసాలనీ ప్రచురించినందుకు ఊదర గోపీచంద్ పైనా ఆంధ్రజ్యోతివారు ఈ కేసు పెట్టారు

1నం పాట

# సారాబందు

—నకిన్

సంపాదన సారకాయెనా - ఓ కూలి బాలన్న
సంసారం భారమాయెనా - ఓ రైతు రామన్న — ॥సం॥

కూలిడబ్బు సారకాయె - కూటికేమి లేకపాయె
ఆకటికి అలమటిస్తు - ఆలుపిల్ల లేడ్సుడాయె
బాదలు మరుసుటని - పండగ సరదాలకాని
అప్పుజేసి నీవు సారా — కప్పలను మింగుడాయె
సారమానురన్నయో - సంసారం జూడరన్నయో (2) — ॥సం॥

పాకెట్లకు మరిగి నీవు - పైస నాశనం జేస్తివి
అతిగ నీవు తాగుడాయె - ఆస్తిపాస్తులరిగిపాయె
తాళిమట్టెలమ్ముడాయె - ఆలునమ్మె కాలమొచ్చె
దివాలా దీసి నీవు - దివానా వై పోతివి
మందు-వదులు రన్నయో నీ-మత్తువదులు రన్నయో (2) — ॥సం॥

మంచిగున్న నీవు దాగి - మంచం బడుతున్నావు
డబ్బులన్నిపోయె కొత్త - జబ్బులెన్నో ఎక్కువాయె
కాళ్ళుజెయ్యిలు నొప్పులాయె - కడుపులోన మంటలాయె
శక్తియంత సారకాయె - రక్తమంత వుడిగిపాయె
ముసలివయ్యిరన్నయో - మూల్గి చస్తివన్నయో (2) — ॥సం॥

గుత్తేదార్లు రౌడీలతో - గుండాయిజం జేస్తున్నరు
సందులల్ల సారనమ్మి - సగం మనల దోస్తున్నారు
సారకంపు సర్కారోడు - సంక్షేమం అంటున్నాడు
కోట్లు కూడ బెట్టి మన - నోట్లె మన్ను బోస్తుండు
సారాబందు కన్నయో - పోరూజెయ్యి మన్నయో (2) — ॥సం॥

సర్కారు - ప్రజలంతా - సారబందు జెయ్యాలని
ఉవ్వెత్తున లేచి స్త్రీలు - ఉద్యమాలు జేస్తున్నరు
సారవద్దు మాకు మంచి - నీరు - పాలు గావాలని
పోర గాండ్లు వొక్కటయ్యి - పోరుబాట పట్టినారు
సారబందులన్నయో - నీ - జోరు జూపు రన్నయో (2) — ॥సం॥

మత్తులోన ముంచుకుంట - మనల దోచుకునేటోన్ని
ఓట్లకు పాకెట్లు బంచి - సీట్లు దొబ్బుకునేటోన్ని →

( 32వ పేజీ తరువాయి )

తడిగా, నాచుతో వున్న శవాన్ని పట్టుకోడానికి వచ్చిన ఇద్దరికీ సాధ్యం కావడం లేదు. జారిపోతోంది. అది గమనించి చంద్రిగాడిని కేకేశాడు శంకరయ్య.

"చంద్రిగా!"

జవాబులేదు. చుట్టూచూస్తూ మళ్ళీ పిలిచాడు. ఈసారికూడా జవాబురాలేదు. శంకరయ్యలో ఏదో అనుమానం, చేతిలోని టార్చిలైటువేసి చుట్టూ తిప్పుతూ మరింత బిగ్గరగా కేకేశాడు.

"ఒరేయ్ చంద్రిగా!!"

సీతారాముడి కళ్ళల్లో అనుమానం. అయితే అంతలోనే ఒక్కప్రక్కనుంచి ఏదో జంతువు మూలిగినట్టయింది. అయితే అది చంద్రిగాడి గొంతని బతికే వున్నాడని శంకరయ్య, సీతారాముడు పసిగట్టి, కాస్త ఊపిరిపీల్చుకున్నారు. అతికష్టంగా అడుగులోఅడుగు వేసుకుంటూ చీకటిలోనుంచి బయటకొచ్చాడు చంద్రిగాడు.

"ఎక్కడ చచ్చావురా! ఆళ్ళకి వీలుకావడంలేదు. నువ్వో ఓ చెయ్యివెయ్యి" విసుగ్గా అరిచాడు శంకరయ్య. నెమ్మదిగా రిక్షా దగ్గిరకి వెళ్ళాడు. చంద్రిగాడు రాగానే, ఆసుపత్రి సిబ్బంది ఒకడు కాళ్ళవైపుకి, మిగిలినవాడు, తలవైపుకి సర్దుకున్నారు. చంద్రిగాడు నడుం దగ్గర పట్టి ఎత్తాడు. శంకరయ్య సలహాలిస్తూ టార్చిలైటు శవంమీదకు వేశాడు. అప్పుడు శవం ముఖం స్పష్టంగా కనిపించింది. శవం ముఖం చూసిన చంద్రిగాడి గుండె లోతులనుంచి ఒక్క మూగకేక.

"గంగి!"

గొంతుకే పరిమితమైన పెనుకేక.

"గంగీ!!"

"దించడయ్యా ఇప్పుడు ఆ( అలాగ .... ఒరేయ్ చంద్రిగా పట్టు .... నిన్నేరా!" వెనకనుంచి శంకరయ్య అరుస్తున్నాడు.

---

→ తాగెటోన్ని అమ్మెటోన్ని – తాగుమాని వాగేటోన్ని
పోరునాపె పోలీసోన్ని - సారా నమ్మె సర్కారోన్ని
తన్నితన్నిరన్నయో - తరిమికొట్టురన్నయో (2) — సం॥

("కందిచేన్లల్లరో ఓ మరిది రాజమల్లు"అనే మాదిరి దూలపాట బాణీలో పాడుకోవాలి)

( 3వ కవరు పేజీ తరువాయి )

మాదగ్గర పైసలు లెవ్వంటె
గుండాలు గుడుంబు జేసి అగ్వకమ్ముతరు
సారదుకాణాలు బందుపెట్టుండ్రంటె
పోలీస్ స్టేషన్ల అమ్మి మాకుతెక్కలు కోస్తరు
మాకు కరువొచ్చిన
మాకు రోగాలొచ్చిన
మాకు యింత గంజిలేకున్న

తాగెందుకు మంచినీల్లు లేకున్న
సర్కారువోరల కెందుకు ?
సారపొట్లాల్తోటి మా బతుకు లెల్లదీస్తరు
సారపొట్లాల్తోటి వోట్లేయించుకుని
సీట్లమీద కూసుంటరు —
మేం తాగుడాపంగనె కతమయ్యే కత కాదిది
మేం బంద్ జేస్తమని పోట్లు పెట్టంగనె వాడికి పోయె
యేడ్పుకాదిది —

మా బతుకులల్ల
కన్నీల్లు నింపినోడు బూడిదయితెగాని
మా పాట్లు కడతేరవు
మానెత్తురుతోటి యాపారం జేసి గద్దెనెక్కినోడు
నాశనమైతెగని
మా గుడిసెలల్ల సెంద్రుడు పకపకనవ్వడు
ఆ దినం కోసం
మేం కండ్లు కాయలు కాసెటట్లు సూస్తున్నం
కాయలుకాసిన మా సేతులు కలిపి
దొరల మీదికి వురికెతందుకు
ఈ తాగుడు పూరాగా బందుపెడ్తం —
సీకట్లకెల్లి ఎల్తుర్లకొచ్చిన మేం
మారాజ్యమొచ్చేదాక
ఇగ నిద్రనే పోం !

# నీతిలేని ఆదాయం!

—తిరునగరి రామాంజనేయులు

సమాజమున పెను విపత్తు
సారా వ్యాపారమ్మని
శ్రమజీవుల పాలిట, అది
ప్రమాదకర శాపమ్మని
కష్టజీవు లెందరినో
కొల్లగొట్టి గుల్లజేసి
కష్టార్జిత మంత దోచి
కాపురాలు కూల్చిందని
అందరి కెరికే
లోక మంతటి కెరికే ...
సారాసుర సంహరింప
సామాజిక ప్రగతి పెంచ
ఊరూరా తల్లులు ఒక
పెల్లువలా లేచారు
అన్ని రాజకీ యాలకు
అతీతంగ పెల్లుబికిన
అనుభవ ఆవేదనలకు
అద్దం పట్టిన పోరూ
ఆపలేరురో
ఎవ్వరు అడ్డలేరురో ...
మాకొద్దూ బాబో, యీ
మాయదారి సారా అని
తాగినోని ఆలిగ యిక
తాము బతకనే లేమని
పల్లె పల్లెనుండి పోరు
జిల్లాలకు పెల్లువాయె
ఉప్పెనవలె స్త్రీలోకం
ఉగ్రరూప మెత్తినాది
ఆపలేరురో
ఎవరూఅడ్డలేరురో ...
సారా కంట్రాక్టర్లంత
సర్దుకోండి మూటముల్లె
వారి రౌడి మూకలంత
వాళ్ళ దగ్గరుంచుకోండి
మీ భార్యలు కూతుళ్ళే
మీకెదురై పోరుతారు
సారా సురు వధియింపగ
సత్యభామ లౌతారూ
ఆపలేరురో
ఎవడూ అడ్డలేడురో ...
గాంధి తాత ఏనాడో
కూడదన్నదీ సారా
గాంధేయుల పాలనలో
కోట్లకు పడగెత్తిందీ
నీతిలేని ఆదాయం
జాతికి పట్టిన చీడ
సాగదింక సాగదంటు
స్త్రీలోకం మేల్కొందీ
ఆపలేరురో
ఉద్యమ మణచలేరురో ...

త్యాగమేరా జీవితం : 3

# మెరుపు వీరుడు కుజ్నెత్సోవ్

— క్రాంతికిరణ్

రెండవ ప్రపంచ యుద్ధం సాగుతున్న రోజుల్లో, ఫాసిజం పడగ విప్పి బుసకొడుతున్న సమయంలో, ప్రథమ సోషలిస్టు రాజ్యాన్ని కబళించడానికి కదలి వెళ్ళిన నాజీ రక్కసులకూ, సోవియట్ వీర పుత్రులకూ మధ్య సమరాగ్నులు చెలరేగిన తరుణంలో ఓ రోజున - సార్నీ అడవుల ప్రక్కన రోడ్డుపై నెమ్మదిగా వెళుతున్నాయి మూడు నాటు బండ్లు. మాస్కో నగరానికి దక్షిణంగా వెయ్యి కిలో మీటర్ల దూరాన ఉన్న సార్నీ అరణ్యాలలోంచి రోవ్నో నగరానికి పోతుందా రోడ్డు. ఆ నాటు బండ్లు యిపుడు రోవ్నో నగరం వైపుకే పోతున్నాయి.

మొదటి బండిలో ఒక 'జర్మన్ ఆఫీసర్' కూర్చున్నాడు. అతని ప్రక్కనే ఓ 'దేశద్రోహి' కూడా ఉన్నాడు. మిగిలిన రెండు బండ్లూ పోలీసు బలగాలతో నిండిపోయి ఉన్నాయి.

బండ్లు నింపాదిగా ముందుకు సాగిపోతున్నాయి. 'జర్మన్ ఆఫీసర్' నిటారుగా కూర్చొని, ఠీవిగా దిక్కుల్ని పరికిస్తున్నాడు, అతని చూపుల్లో గర్వాతిశయం తొణికిసలాడుతోంది.

ఆ జర్మన్ మూకని చూచి, మార్గమధ్యంలోని గ్రామాల ప్రజలు హడలెత్తి పోతున్నారు. ప్రాణాల్ని అరచేతుల్లో పెట్టుకొని, పరుగు పరుగున వారు తమ గుడిసెల్లోకి దూరి, కిటికీల్లోంచి రోడ్డువేపు తొంగి చూస్తున్నారు.

ఆ మూకకి ముందూ వెనుకా జర్మన్‌లకు చెందిన కారులూ....లారీలూ.... మిలిటరీ వాహనాలూ అసంఖ్యాకంగా కదులుతున్నాయి. ఏదేనీ కారు తమ సమీపానికి వచ్చినప్పుడల్లా, ముందు బండిలో కూర్చున్న జర్మన్ ఆఫీసర్' తన కుడి చేతిని ముందుకు చాచి, "హెయిల్ హిట్లర్ !" అంటూ సెల్యూట్ చేస్తున్నాడు

మూడు గంటలసేపు ఆ బండ్లు ముందుకు సాగాక, వారికి కావలసిన కారు అలా ఎదురుగా వస్తూ కనిపించింది.

'జర్మన్ ఆఫీసర్' సైగజేశాడు. అతని ప్రక్కనున్న 'దేశద్రోహి' గబాలున బండిలోంచి క్రిందికి దూకేసి, బండి ముందుకుపోయి మిలటరీ మార్చ్ చేశాడు. మిగిలిన బండ్లలోని వారు కూడా అటెన్షన్ పొజిషనులోకి వచ్చేశారు.

ఇంతలో.... కారు 'జయ్'....మంటూ నాటుబండ్ల సమీపానికి వచ్చింది.

మార్చ్ చేస్తున్న 'దేశద్రోహి' చేతిలోంచి, ఒక ట్యాంకు విధ్వంసక గ్రెనేడ్

ఎగిరివెళ్ళి కారు వెనుక భాగంలో పడి, పేలడం, కారు రోడ్డు ప్రక్కనే వున్న కాల్వలో బోల్తా కొట్టడం-క్షణంలో జరిగిపోయాయి. ఆ కారులో ప్రయాణిస్తున్న ఇద్దరు జర్మన్ మిలటరీ ఆఫీసర్లు కంగారుగా కారులోంచి బయటకు దూకేయడం, ఇంతలో నాటు బండిలో ఉన్న 'జర్మన్ ఆఫీసర్' వారిద్దర్నీ పట్టి బంధించి, తన వారితో సహా సార్ని అరణ్యంలోకి అదృశ్యమైపోయాడు.

మెరుపు వీరుడైన ఈ 'జర్మన్ ఆఫీసర్' మరెవరో కాదు - ఉరల్స్ ప్రాంతం నుండి ఉక్రేనియన్ ప్రాంతపు సార్ని అడవులకు వచ్చిన, సోవియట్ గెరిల్లా వీరుడు కామ్రేడ్ కుజ్నెత్సోవ్. కామ్రేడ్ ద్మిత్రియ్ మెద్వేదేవ్ నాయకత్వాన ఉన్న ఒక గెరిల్లా దళంలో-అతి ముఖ్యుడు.

## గెరిల్లా దాడులు :

నాజీ నియంత హిట్లర్‌ని మట్టి కరిపించడానికి సోవియట్ రష్యా ప్రయోగించిన మెరుపు దాడుల్లో గెరిల్లా దాడులు ముఖ్యమైనవి. ఈ గెరిల్లా దళాల్లో చేరడానికి స్వచ్ఛందంగా వేలాదిమంది యువకులు దేశం నలుమూలల నుండి ముందుకు వచ్చారు.

ఒక ప్రక్కన స్టాలిన్ గ్రాడ్, లెనిన్‌గ్రాడ్ ప్రాంతాల్లో నాజీ సైన్యానికీ, ఎర్ర సైన్యానికీ మధ్య భీకర సమరం సాగుతూంటే, మరొక ప్రక్క ఈ గెరిల్లా దళాలు నాజీ సైన్యానికి వెనుక భాగాన్ని చుట్టుముట్టి, వారిపై మెరుపు దాడులు చేస్తూ వారి శక్తిని నిర్వీర్యపరచేవి. ఆయా పట్టణాల్లో ఉన్న జర్మన్ అధికారులను తుద ముట్టించడం, సైనికులను సరఫరా చేసే రైళ్ళను మందులు పెట్టి పేల్చి వేయడం, వంతెనలను కూల్చి వేసి, సైనిక రవాణాకు అంతరాయం కల్గించడం ఇలాంటి చర్యలు చురుకుగా సాగించి, శత్రువుని చికాకుపరచి, చెల్లాచెదరు చేసి, శత్రువు గుండెల్లో భయం పుట్టించేవారు గెరిల్లా యోధులు.

తాము తలపెట్టిన ఈ కార్యక్రమాన్ని ఎంతటి ప్రమాదకరమైన పరిస్థితులలో నైనా వెనుదీయక, తమ ప్రాణాల్ని సైతం లెఖ్ఖచేయక, విజయవంతం చేసిన వేన వేల గెరిల్లా వీరుల్లో కామ్రేడ్ కుజ్నెత్సోవ్ అగ్రగామి.

కుజ్నెత్సోవ్ స్ఫురద్రూపి గంభీరమైన ముఖవర్ఛస్సూ, ధూసర నయనాలూ-అతనికి మరింత దర్పాన్ని చేకూర్చిపెట్టాయి. శారీరక బలం, మనో ధైర్యం, గుండె నిబ్బరం- వీటిని మించి బుద్ధి కుశలత ఇవ్వన్నీ కలసి కుజ్నెత్సోవ్‌ని అనతి కాలం లోనే ఉత్తముడైన గెరిల్లాగా తయారు చేశాయి.

వృత్తిరీత్యా ఇంజనీరైన కుజ్నెత్సోవ్ భాషా కోవిదుడు కూడా. జర్మన్ భాష అతనికి కొట్టిన పిండి. జర్మన్‌ల ఆచార వ్యవహారాలూ, హావభావాలూ, జర్మన్‌ల స్వభావం గురించి బాగా అధ్యయనం చేసినవాడు కావడంతో తన ప్రావీణ్యాన్ని ఉపయోగించి అతడు ఓ జర్మన్ ఆఫీసరు వేషం ధరించి సార్ని అరణ్యాలలోని తన

గెరిల్లా దళం నుండి రోవ్నో నగరానికి ఒక జర్మన్ సీనియర్ లెఫ్టినెంట్‌గా అవతారం మార్చి, వెళ్ళి- అక్కడ నుండి తన కార్యక్రమాలు సాగించాడు.

తాను చేపట్టినకార్యం కత్తిమీద సాములాంటిదని, తన బ్రతుకు దిన దిన గండమని తెలిసి వుండికూడా, కావాలని తనే కోరి కోరి ఈ మార్గాన్ని ఎన్నుకున్నాడు కుజ్నెత్సోవ్.

అంత మాత్రాన అతనికి ఆ అవకాశం తేలికగా దక్కేదికాదు. గెరిల్లా దళాధిపతి, అతనికి అంత తేలికగా ఆ అవకాశం ఇచ్చేవాడూ కాదు. తొందరపడి ఒక గెరిల్లా వీరుని పోగొట్టుకోవడమంటే ఆ రోజుల్లో సామాన్యమైన విషయంకాదు విజయం ఒక్కరోజు వెనక్కి పోవడమే అని అర్థం. కాని, తాను కోరుకున్న విధంగా జర్మన్ అధికారి వేషంధరించి రోవ్నో నగరానికి వెళ్ళడానికి కుజ్నెత్సోవ్‌కి అనుమతి తేలిగ్గానే లభించింది. అలా అతన్ని పంపడం వల్ల అతనికిగానీ, గెరిల్లా దళానికి గానీ ఎలాంటి నష్టమూ వాటిల్లదని గ్రహించిన తర్వాతనే అతణ్ని రోవ్నో పట్టణానికి పంపారు.

**జర్మన్ లెఫ్టినెంట్ పాల్ సీబెర్ట్ :**

కుజ్నెత్సోవ్ 'పాల్‌సీబెర్ట్' అనే పేరు మార్చుకొని, జర్మన్ సైన్యంలో తానొక సీనియర్ లెఫ్టినెంట్‌నని చెప్పుకొంటూ, అందుకు తగిన ఫోర్జరీ పత్రాలు సృష్టించుకొని, రోవ్నోలో అనేకమంది జర్మన్ అధికారులతో సాహచర్యం కల్గించుకొన్నాడు.

ఇలా పరిచయం చేసుకున్నవారిలో అత్యంత 'ఆత్మీయుడైన' స్నేహితుడు జర్మన్ సైనిక కార్పోరల్ అయిన ష్మిట్ ఒకడు. ష్మిట్ పోలీసు కుక్కల్ని తర్ఫీదునీయడంలో దిట్ట. ఓ రోజున ష్మిట్ తను జర్మన్ 'కేంద్ర ప్రభుత్వ అధికారి (గావ్‌లైటర్) అయిన కోఖ్' కోసం తర్ఫీదు ఇస్తున్న ఒ అల్సేషన్ కుక్కని వెంటబెట్టుకొని, కుజ్నెత్సోవ్ దగ్గరకు వచ్చాడు. పలకరింపులైన తర్వాత "నేను తర్ఫీదు ఇస్తున్న కుక్కల్లో ఇది ఎనిమిదోది. ఆర్యనేతరుణ్ని ఎవడినైనా సరే ఇది ఇట్టే పోల్చుకుంటుంది. ఇహ చూశారూ— ఆమడ దూరంలో న్నా గెరిల్లానైనా సరే ఇట్టే పట్టేస్తుంది" అని తన గొప్ప, తన కుక్క గొప్పతనం గురించి గప్పాలు కొట్టసాగాడు ష్మిట్. "నిజంగానే? ఎంత తెలివైన కుక్కండీ" అన్నాడు కుజ్నెత్సోవ్ ఆశ్చర్యపడుతూ. అలా అని ఆ కుక్కకి ఒక రొట్టె ముక్క వేశాడు కుజ్నెత్సోవ్. అది కుజ్నెత్సోవ్ వైపు తిరిగి కృతజ్ఞతా భావంతో తోక ఊపడం ప్రారంభించింది.

ఇలా అచ్చం జర్మన్‌లానే మారిపోయిన కుజ్నెత్సోవ్, ష్మిట్ ద్వారా ఓరోజు సరాసరి జర్మన్ కేంద్ర ప్రభుత్వ అధికారి అయిన కోఖ్ కార్యాలయానికి సరాసరి

పోయి కోఫ్‌తోనే సలభై నిమిషాలుపాటు గడపి అతని నుండి అనేక 'రాయితీలు' పొందీ, రోవ్నో నగరంలో ఒక ప్రసిద్ధ జర్మన్‌లా స్థిరపడిపోయాడు.

జర్మన్ క్లబ్బులలో తిరుగుతూ, విందులు ఆరగిస్తూ జర్మన్ ప్రభుత్వ రహస్యాలను గ్రహించి, తాను బయటపడకుండా ఎప్పటికప్పుడు క్రమం తప్పకుండా తన గెరిల్లా దళానికి వాటిని చేరవేస్తూ ఉండేవాడు.

ఇలా చేస్తూనే, ఏయే కార్యాలయాలలో ఆయా ప్రభుత్వ, మిలిటరీ అధికారులు, ఏయే సమయాల్లో ఎక్కడెక్కడ ఉంటారో, వారిని మట్టుబెట్టడానికి ఏయే మార్గాల వెంట వెళ్ళవలసి ఉంటుంది- ఇలాంటి విషయాలన్నీ కూడా క్షుణ్ణంగా పరిశీలించి, పకడ్బందీగా మంచి పథకాలు సిద్ధంచేసుకొని, సమయంకోసం కాచుకుకూర్చొన్నాడు కుజ్నెత్సోవ్.

## దుష్ట సంహారానికి గ్రీన్ సిగ్నల్

తొలుత 'దుష్ట సంహారానికి' కుజ్నెత్సోవ్‌కి తన దళం నుండి అనుమతి లభించలేదు. పరిస్థితులు పరిపకా[illegible]వనికి వచ్చిన తర్వాత స్టాలిన్‌గ్రాడ్, లెనిన్‌గ్రాడ్ సమరాల్లో శత్రువులు [illegible] కరచి పలాయనం ప్రారంభించబోయే ముందు కుజ్నెత్సోవ్‌కి, స్త్రుతిని[illegible]యని, వాల్య అనే మరో మహిళా కామ్రేడ్ నీ తోడుగా ఇచ్చి దుష్ట స[illegible]హారానికి గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది తన గెరిల్లాదళం.

క్యాంపు నుండి వెళ్ళబోయే ముందు కుజ్నెత్సోవ్ దళ కమాండర్ కామ్రేడ్ దిమిత్రియ్ మెద్వేదేవ్‌తో కరచాలనం చేసి, ఓ కవరు యిచ్చి వెళ్ళిపోయాడు. ఆ కవరుపై "నా మరణానంతరం దీన్ని విప్ప వలెను" అని వ్రాసి ఉంది.

కుజ్నెత్సోవ్ ఇన్నాళ్ళుగా ఓర్పుగా, ఓపిక పట్టి అణచుకొన్న తన వీరత్వాన్ని ఒక్క సారిగా నిద్ర లేపాడు. శత్రు సంహారం ప్రారంభించాడు.

ఏరిఖ్ కోఖ్.... పౌల్ డార్గిల్.... హెర్మన్ క్నూట్ .... ఇవ్వన్నీ పశ్చిమ ఉక్రైనియాలో నాజీ ఆక్రమణ కాలంలో పేరు మోసిన కిరాతకుల పేర్లు. ఉక్రైనిని యాను సర్వం కాలరాసిన కర్కోటకులు వీళ్ళు. ఈ పేర్లు ఒక్కసారి తలచుకొంటే చాలు....సోవియట్ వీరుల రక్తం సలసల కాగిపోయేది.

ఎంత మందిని జైళ్ళ పాలు చేశారో, మరెంత మంది అమాయకుల్ని ఉరి తీయించారో లెఖ్ఖలేదు. సజీవ ఖననాలు జరిగిన కందకాలు, లక్షలాది నిర్దోషుల మరణాలు, వీరిపేర్లతో శాశ్వతంగా పెనవేసుకుపోయాయి.

అలాంటి దుర్మార్గుల్ని నేల రాయడానికి శపథం పూని సాగిన కామ్రేడ్ కుజ్నెత్సోవ్ తన సంహారంలో తొలి శలభంగా డార్గెల్‌ని ఎన్నుకొన్నాడు.

## డార్గెల్ పై తొలి వేటు

ఆరోజు సెప్టెంబర్ 20.

అది జర్మన్ ఉద్యోగులు మాత్రమే నివసించే పెద్ద రాజ వీధి· ఆ వీధిలో ఉంది రాజ భవనం. అదే డార్గెల్ నివాసం. మధ్యాహ్నం 2గం॥ 30ని ॥ కావస్తుంది. ఇంతలో ఓకారు వచ్చి ఆ వీధి చివర ఆగింది. జర్మన్ యూనిఫారంలో స్త్రుతీనిస్కీయ్ డ్రైవర్ స్థానంలో ఉన్నాడు. కారులో జర్మన్ ఆఫీసర్ పౌల్‌సీబెర్ట్ ఆసీనుడై కన్నార్పకుండా రాజ భవనం కేసి చూస్తున్నాడు. ఇంతలో ఇద్దరు వ్యక్తులు భవనం బైటకు వచ్చి మెట్లు దిగుతూ క్రిందికి వస్తున్నారు.

"కామ్రేడ్ కారు పోనియ్"– అన్నాడు కుజ్నెత్సోవ్. మెరుపులా కారు రాజ భవనం ముందుకు దూసుకు పోయి ఆగింది. కుజ్నెత్సోవ్ కారు దిగి వారికేసి నడిచాడు. కారు దిగింది జెర్మన్ లెఫ్టినెంట్ కావడంతో కాపలాదారులకు ఏమాత్రం అనుమానం రాలేదు. కుజ్నెత్సోవ్ అడుగుల చప్పుడు విని ఆ ఇద్దరూ వెనక్కు తిరిగి చూశారు. అంతే! రివాల్వర్ నిప్పులు కక్కింది.

కుజ్నెత్సోవ్ ఎగిరి కారులోదూకాడు. క్షణంలో కారు ఆ వీధిలోకి దూసుకు పోయి మహానగరంలో అదృశ్యమైపోయింది. కుజ్నెత్సోవ్, స్త్రుతీనిస్కీయ్‌లు సార్నీ అడవులకు చేరుకున్నారు.

ఐతే రెండు రోజుల తరువాత అసలు విషయం తెలిసింది. తాము చంపింది డార్గెల్‌ని కాదని, అలాంటి పోలికలేఉన్న మరో అధికారినని. ఐనా కుజ్నెత్సోవ్ నీరసపడలేదు. తన లెఫ్టినెంట్ వేషం మార్చేసి 'కెప్టెన్' వేషం తగిలించుకుని, ఆ హత్య జరిగిన పదిరోజులకే తన కారుకు నలుపురంగు మార్చి నంబరు ప్లేటుమార్చి రోవ్నో పట్టణానికి బయలుదేరాడు. తిరిగి అదేసమయంలో డార్గెల్‌పైన ఓ చేతి బాంబుని విసిరి వస్తుంటే ఈసారి ఓ గస్తీకారు, వారి కారును వెంబడించింది· కుజ్నెత్సోవ్ కొంతదూరం పోయేసరికి తమ కారులాంటి నల్లటికారే మరొకటి తమ కారు ముందు పోతోంటే, ఓ మూల మలుపులో తమకారుని ప్రక్కసందులోకి పోనివ్వమన్నాడు. వారలా తప్పుకోగానే గస్తీకారు ఆ ముందుపోతున్న కారునే నేరస్తులకారని భ్రమపడి దాన్ని వెంబడించి, దానిపై కాల్పులు జరిపి దానిలోఉన్న జర్మన్ మేజర్‌ని పట్టుకుని చితక్కొట్టి అరెస్ట్‌చేశారు.

చాకచాక్యంగా కుజ్నెత్సోవ్ తిరిగి తన క్యాంపు చేరుకున్నాడు.

ఐతే ఈసారికూడా డార్గెల్ మరణించలేదు కానీ, తీవ్రంగా గాయపడి, తన పదవిని వదులుకొని, రష్యా వదలి, స్వదేశం చేరుకున్నాడు.

అయితే, ఈ సంఘటనతో రోవ్నో నగరంలోని జర్మన్ అధికారులందరికీ బదిలీలు జరిగాయి. కొందరికి పదవులు ఊడిపోయాయి. మరి కొందరికి శిక్షలు పడ్డాయి.

ఓ విధంగా ఇది గొప్ప విజయం క్రిందే లెక్క. ఈ విజయాన్ని పురస్కరించుకొని కుజ్నెత్సోవ్ 'శత్రుసంహారానికి' తిరిగి రోవ్నో పట్టణం బయలుదేరాడు. ఈసారి దారిలో అనేక చెక్‌పోస్టులు దాటుకుంటూ వెళ్ళి, చివరకు తనే ఓ చెక్‌పోస్ట్ ఏర్పాటుచేసి వచ్చేపోయే కార్లని తనిఖీచేస్తూ చాకచాక్యంతో చివరికి రోవ్నో చేరుకొన్నాడు.

## క్నుట్ హత్య

ఈసారి తమ ఎరగా, జర్మన్ ప్రభుత్వ సాధారణ వ్యవహారాలశాఖ ఆఫీసర్‌ని ఎన్నుకున్నారు. ఆయన పేరు క్నుట్. మంది సొమ్ముతిని పందిలా బలిసిన క్నుట్ సాయంత్రం ఆరుగంటలకు తన కార్యాలయం నుండి బైటకువచ్చి, కారులో బయలుదేరి కొద్దిదూరం వచ్చాడోలేదో, ఆకారుకి ప్రక్క రోడ్డున నిలబడి ఉన్న 'జర్మన్ ఆఫీసర్' గారి కారులోంచి ఒక టాంకు విధ్వంసక గ్రెనేడ్ వచ్చి క్నుట్ కారుపై పడి పేలింది. క్నుట్ కారు గతితప్పి ఓ గోడకు గుద్దుకొని ఆగిపోయింది. ఆకారుపై క్షణంలో సబ్‌మెషీన్‌గన్ అగ్నిగుండ్లు కురిపించి మరుక్షణంలో ఆ 'జర్మన్ ఆఫీసర్' గారి కారు అదృశ్యమై పోయింది.

ఇలా జరిగింది క్నుట్ హత్య.

## ఇగ్నెల్ అపహరణ

క్నుట్ హత్య జరిగిన కొద్దిరోజులకే మరొక సంఘటన జరిగింది. అది ఉక్రైనియాలో స్పెషల్ సైనిక బలాలకు నాయకత్వం వహించే జనరల్ ఇగ్నెల్‌ని అపహరించే కార్యక్రమం ఎంచుకున్నాడు కుజ్నెత్సోవ్.

ఆరోజు జనరల్ ఇంకొద్దిసేపటికి బయటికి వస్తాడనగా, ఆయన కార్యాలయ భవనం ముందు ఓ కారు వచ్చి ఆగింది. అందులోంచి కుజ్నెత్సోవ్ మరో ఇద్దరు కామ్రేడ్లు దిగారు. కుజ్నెత్సోవ్ జర్మన్ కాప్టెన్ వేషంలో ఉన్నాడు. మిగిలిన వారుకూడా జర్మన్ల వేషాల్లోనే ఉన్నారు. భవనం ముందు సెంట్రీ పహరా కాస్తున్నాడు. ఐనా కుజ్నెత్సోవ్‌కి ఎలాంటి అభ్యంతరమూ చెప్పలేదు. సరాసరి లోపలకి వెళ్ళి లోపలఉన్న మరో సెంట్రీని నిరాయుధుణ్ని చేసి, జనరల్ ఇగ్నెల్‌వచ్చేలోగా ఆఫీసులోని ముఖ్యమైన డాక్యుమెంట్లన్నీ, స్వాధీనం చేసుకున్నాడు. భవనం ముందు కాపలా ఉన్న సెంట్రీని కూడా నిరాయుధుణ్ణిచేసి, వాడి యూనిఫారం స్ట్రిప్‌ని స్కీయ్‌కి వేసి, వాడిస్థానంలో నిలబెట్టాడు కుజ్నెత్సోవ్.

అప్పుడే చీకటిపడుతోంది. ఖచ్చితంగా అసమయానికే జనరల్ ఇగ్నెల్ వచ్చి కారుదిగి, తన కారుడ్రైవర్‌ని వెళ్ళిపొమ్మన్నాడు. మరుక్షణంలో కుజ్నెత్సోవ్ అతన్ని రివాల్వర్‌తో బెదిరించి, బంధించి, నోట్లో గుడ్డలు కుక్కి, తన కారులో వేసుకొని, సెంట్రీలను కూడా ఎక్కించుకొని, రాజఠీవితో రాజమార్గాన్నే నగరం దాటి, తన దళం వద్దకు చేరుకున్నాడు.

## (అ) న్యాయమూర్తికి మరణశిక్ష

ఈ చర్యతో రోవ్నో నగరంలో పెద్ద సంచలనం చెలరేగింది. జర్మన్ అధికారులందరూ హడలిపోయారు. గెరిల్లాల చర్యలకు మండిపడి ఉక్రైనియాలోని జర్మన్‌ల ప్రధాన న్యాయమూర్తి పుంక్ రోవ్నో నగరంలో ఉన్న సోవియట్ ఖైదీలందరినీ కాల్చి వేయమని ఆజ్ఞలిచ్చాడు. దానికి ప్రతిఫలం వాడు అనుభవించాలని, గెరిల్లా వీరులు నిర్ణయించుకొని వాడికి 'మరణశిక్ష' విధించి, దాన్ని అమలు చేసే బాధ్యతని కుజ్నెత్సోవ్‌కి ఒప్పజెప్పారు.

కుజ్నెత్సోవ్ తన మిత్రులను ఒకరిద్దరిని వెంటబెట్టుకొని, రోవ్నో చేరి సరాసరి పుంక్ కారాంలయంలోకి వెళ్ళి, వెయింటింగ్ రూంలో ఉన్న పుంక్ సెక్రటరీ ఐన యువతితో బాతాఖానీ ప్రారంభించాడు. అతడు ఆ అమ్మాయితో కబుర్లు చెబుతూనే కిటికీలోంచి బైటకు చూస్తున్నాడు. పుంక్ వస్తున్నట్లు అతనికి సిగ్నల్ వచ్చింది.

"సాయంకాలం ఆరుగంటలకి ఆ వీధిచివర మీకోసం ఎదురుచూస్తూ ఉంటాను. మనం ఎక్కడికైనా వెళ్ళి సరదాగా కాలక్షేపం చేద్దాం .... తప్పక వస్తారుగదూ?" అని అడిగాడు కుజ్నెత్సోవ్.

"ఓ .... వస్తాను" అంది ఆ అమ్మాయి.

"దయచేసి ఓ గ్లాసు టీ ఇవ్వగలరా?"

"ఓ దానికేముంది .... కెప్టెన్‌గారు! నేనే తీసుకొస్తా!" అంటూ ఆ యువతి ప్రక్కనున్న గదిలోకి వెళ్ళింది. సరిగ్గా అదేసమయానికి పుంక్ ఆ రూం లోకి ప్రవేశించాడు.

అంతే ....

బైట వరండాలో ఉన్న వారికి 'టప్ టప్' మని రివాల్వర్ శబ్దం వినిపించింది.

జనం అటూఇటూ పరుగులు పెట్టారు. కుజ్నెత్సోవ్ ఏమీ ఎరుగనివానిగా మెట్లుదిగి తన తోవన తాను వెళ్ళిపోయాడు. ఆ తర్వాత పోలీసులు వచ్చి కార్యాలయం లోపల ఉన్న ఓ 20 మందిని అనుమానించి అరెస్ట్ చేశారు.

## నాజీల పలాయనం

ఈ సరికే ఎర్రసైన్యం, నాజీ సైన్యాన్ని లక్ష 20 వేలమందిని హతమార్చి పురోగామియై పరుగులు తీస్తూంది. చేసేదిలేక జర్మన్ ముష్కరులు చేతికందిన వారికి అందినంత సొమ్ము చేతబట్టుకొని రోవ్నోను వదలి ల్వోవ్ నగరానికి పలాయనం ప్రారంభించారు. ఈ పలాయనంలో జరిగిన పోరాటంలో గెరిల్లాదళాలు

విడిపోయాయి. ఒకదళం అనేక చిన్న చిన్న దళాలుగా చీలి, నాజీసైన్యాన్ని చీల్చి చెండాడడానికి సాగిపోయాయి.

కుజ్నెత్సోవ్ మరికొంతమంది గెరిల్లాలు జర్మన్‌లతోపాటు పలాయనంచేస్తూ, జర్మన్లులా నటిస్తూ, ల్వోవ్‌కి బయలుదేరారు.

## 'నా రివాల్వర్‌కి కావలసింది నీవే'

ల్వోవ్ నగరంలోనూ కుజ్నెత్సోవ్ జర్మన్ అధికారులను వదలిపెట్టలేదు. అక్కడి డిప్యూటీ గవర్నర్ బౌవర్ హత్యకు పథకం వేశాడు. ఓ రోజు బౌవర్ స్థానిక అధికారులతో కలసి ఓ థియేటర్‌లో సమావేశమౌతున్నాడని తెలిసి బౌవర్ రాకకు ముందే కారుపై థియేటర్ వైపుకు బయలుదేరాడు. థియేటర్‌ముందు కారు చెడిపోయినట్లు నటించి దాన్ని ఆపేశాడు. డ్రైవర్ స్థానంలో ఓ కామ్రేడ్, కారును బాగుచేస్తున్నట్లు నటిస్తుంటే, తన ప్రయాణానికి ఆలస్యమైందని ఆ డ్రైవర్ని కుజ్నెత్సోవ్ జర్మన్ భాషలో బండబూతులు తిడుతున్నాడు. ఇంతలో బౌవర్ కారు వచ్చి థియేటర్ ముందు ఆగింది. కుజ్నెత్సోవ్ తన బూతులు ఆపి ఆ కారులోంచి దిగిన వారి దగ్గరకు వెళ్ళి "డాక్టర్ బౌవర్ మీరేనా?" అని అడిగాడు.

బౌవర్ "నేనే" అని సమాధానం చెప్పాడు.

"అయితే నాక్కావలసినది మీరే" అని తన పిస్టల్ తీసి బౌవర్ని, అతని ప్రక్కనున్న అతని సెక్రటరీని కాల్చివేశాడు కుజ్నెత్సోవ్.

యథాప్రకారం కారులోదూకి అతివేగంతో నగరం దాటాడు. ల్వోవ్ నగరం దాటిన తర్వాత ఓ గ్రామం వద్ద పోలీసులు కారు ఆపి అతని డాక్యుమెంట్లు తనిఖీ చేస్తూ, వారివంక అనుమానంగా చూశారు. దీనితో కుజ్నెత్సోవ్ అనుమానపడి, ఇంకా ఇక్కడే కొంతసేపు ఆగితే కొంపమునుగుతుందని ఆలోచించి, కారులోంచి తన మెషిన్‌గన్నును బయటికితీసి, వారిపై కాల్పులు సాగించి ఐదుగురిని నేలకూల్చి కారుపై ఉడాయించారు. వారి కారును మిగిలిన కార్లు వెంబడించాయి. కారువేగంగా పోతూఉండగా అర్థాంతరంగా కారులోని పెట్రోలు అయిపోయింది. ఇక చేసేది లేక కుజ్నెత్సోవ్, తనతోటి డ్రైవర్ కామ్రేడ్ - ఇద్దరూ వేగంగా వెళ్ళే కారులోంచి దూకి ప్రక్కనే ఉన్న అడవిలోకి అదృశ్యమైపోయారు.

* * *

1944 మార్చి 2న ఒక పోలీసుడిటాచ్‌మెంటు కుజ్నెత్సోవ్ అతని అనుచరులను ఆ అడవిలో పట్టుకొని, వారివద్దనున్న డాక్యుమెంట్లు పరిశీలించగా, తమను ఇంతకాలం మోసం చేస్తున్న 'జర్మన్ కెప్టెన్ పౌల్‌స్టీబెర్ట్' ఇతనేనని, కుజ్నెత్సోవ్‌ను గుర్తించి, అతన్ని నిర్దాక్షిణ్యంగా చంపివేశారు.

నాజీ ముష్కరులను నేలకరపించిన ఈ గెరిల్లావీరునికి బ్రతికుండగానే 'ఆర్డర్ ఆఫ్ లెనిన్' అవార్డు లభించింది. ఆ తర్వాత మరణానంతరం 1944 నవంబరు5న సుప్రీం సోవియట్ ఆజ్ఞ ప్రకారం 'సోవియట్ యూనియన్ వీరుడు' అనే అత్యున్నత పురస్కారం లభించింది.

ఆధునిక మానవచరిత్రని ఓ మలుపు తిప్పిన 'ఫాసిజం' ఓటమికి తనశక్తికి మించి తెగించి, జీవితాన్ని త్యాగంచేసిన విప్లవమూర్తి కామ్రేడ్ కుజ్నెత్సోవ్.

## 'నా మరణానంతరం చదవండి ఉత్తరం'

కామ్రేడ్ కుజ్నెత్సోవ్ తన మరణానంతరం చదవాలని తన దళ కమాండరుకి ఇచ్చిన ఉత్తరం ఇదీ :

"1943 జూలై 24, జర్మన్ దురాక్రమణదార్లు మోపిన గాటక్రింద క్రుంగి, దుఃఖంతో మూల్గుతూన్న మన తల్లులూ, అన్నదమ్ములూ నెత్తురునూ కన్నీటినీకార్చినందుకు శత్రువుపై నిర్దాక్షిణ్యంగా పగ సాధించేందుకై నేను శత్రుశ్రేణి వెనుక ప్రాంతంలో అడుగుపెట్టి రేపటికి 11 నెలలు పూర్తి అవుతుంది. 1942 ఆగస్టు 25న, రాత్రి 12 గంటల 05 నిమిషాలకు పారాచూట్‌తో అక్కడ దిగాను.

పదకొండు నెలలపాటు శత్రువును అధ్యయనం చేశాను. జర్మన్ యూనిఫారాన్ని ఉపయోగించి, సర్వోన్నత మండలాధిపతీ, ఉక్రైనియాలో జర్మన్ కంటకుడూ అయిన ఏరిఖ్‌కోఖ్ దయ సంపాదించి అతని సమక్షానికి తొల్చుకువెళ్ళాను.

ఇప్పుడు కార్యానికి దిగుతున్నాను

జీవితమంటే నాకు ప్రేమ, నేనింకా యువకుణ్ణి. కానీ, కన్నతల్లిని ప్రేమించినట్టుగా నేనుప్రేమించుతూన్న నాదేశం కోసం నాజీవితాన్ని త్యాగంచేయడం అవసరమైన పక్షంలో అందుకు నేను సిద్ధమే. రష్యన్ దేశభక్తుడూ, జోలెషేనికూ ఎంతటి సమర్థవంతుడో ఫాసిస్టులు తెలుసుకొందురుగాక! సూర్యుణ్ణి రూపు మాపడం ఎంత అసాధ్యమో, మన ప్రజలను లొంగదీయడమూ అంత అసాధ్యమే అని వారు తెలుసుకొందురుగాక.

నేను మరణించవచ్చు గాక! కాని ప్రజల స్మృతిలో దేశభక్తులు అమరులు.

"నువ్వు చనిపోతావు. నిజమే! కాని జడుపు ఎరుగని దిటవు గుండెల నుండి వెడలేపాటలో నువ్వు ఎల్లప్పుడు సజీవమైన ఉదాహరణగా, స్వాతంత్ర్యానికి వెలుగుకూ సగర్వమైన పిలుపుగా వుంటావు!"....

గోర్కీ రచనలలో నాకు ప్రియతమమైన వాక్యమిది. దీనినిమన యువకులు మరింత తరచుగా పఠింతురుగాక.

మీ
కుజ్నెత్సోవ్."

('దిటవు గుండెలు' గ్రంథం ఆధారం).

# మనం కలగనాలి

— వి. రామానాయుడు.

మనం స్వప్నించాలి
అడవి వసంతాన్ని స్వప్నించినట్లు
అడవి వెన్నెల్ని స్వప్నించినట్లు
అడవి అన్నల్ని స్వప్నించినట్లు
అడవి ఆయుధాల్ని స్వప్నించినట్లు
మనం కలగనాలి
ఉరకలెత్తే నదీ ప్రవాహం ఊరేగింపు
ఆకాశంలో ఇంద్ర ధనస్సు
సభ దగ్గర దృశ్యం జలపాతంలో రాలి పడుతుంది
నగరం మోదుగు పూల వనమై చైతన్యాన్ని స్వప్నిస్తుంది

సాహసికులు స్వప్నిస్తారు
యోధులు స్వప్నిస్తారు
జనం స్వప్నిస్తారు
నేను కవిత్వాన్ని స్వప్నిస్తున్నా .....
కవిత్వం మంచి చెడ్డల్ని స్వప్నిస్తూనా్న....
దేశం లేకుండా జన్మించిన పాలస్తీనా శిశువులు
దేశం కోసం స్వప్నిస్తారు
అపహరింప బడిన నేల కోసం
యుద్ధాన్ని స్వప్నిస్తారు
కాంబోడియా, ఫిలిప్పైనో గెరిల్లాలు
గెలుపుని స్వప్నిస్తారు
జనం శాంతిని కాంక్షిస్తారు
పాలకులు యుద్ధాన్ని 'ప్రసాదిస్తారు'
మనల్ని రక్తసిక్తంచేసే వాళ్ళు ఉన్నన్నాళ్ళూ
మన కలల్ని ఛిద్రం చేసేవాళ్ళు ఉన్నన్నాళ్ళూ
మనం యుద్ధాన్ని స్వప్నిస్తూనే ఉండాలి

ఒక గాఢమైన స్వప్నం యుద్ధం తర్వాత
ఓటమిని గెలుపుని స్వప్నిద్దాం
నేను విప్లవాన్ని కలగంటున్నా ....
జనం విముక్తిని కలగంటున్నా ....
మార్క్స్ పారిస్ కమ్యూన్ని కలగన్నాడు

లెనిన్ అక్టోబర్ విప్లవాన్ని స్వప్నించాడు
సామ్రాజ్యవాదం ఎల్ట్సిన్‌ని వాంతి చేసుకుంది
చరిత్రంటే చెదిరిన స్వప్నం కాదు
కత్తుల కోలాటం మధ్య
కాలంతో కఠిన ప్రయాణం
విజయాల నుండి
విషాద సన్నివేశాల నుండి
గెలుపు నుండి, ఓటమి నుండి
కూలిపోయిన స్వప్నాల నుండి
పాఠాలను స్వప్నిద్దాం
నేను క్రెమ్లిన్ మీద మళ్ళీ ఎర్ర జెండాని స్వప్నిస్తున్నా ....
నిజంగా నేను దుస్సాహసికుడినైన స్వాప్నికుణ్ణే
నా ఆశ అనంతాకాశాలకు విశ్వాంతరాళాలకు వ్యాపిస్తుంది
అధికారం భద్రత కోసం ఉక్కు పాదం / మోపిన నేల తెలంగాణా
ఏ పల్లెను కదిలించినా రక్తం స్రవిస్తుంది
ఎక్కడ తవ్వినా నెత్తురు ఊరుతుంది
ఏర్లూ, వాగులూ, వంకలన్నీ రక్త ప్రవాహాలే
దాడులకు ఆకులు అల్లాడుతున్నాయి
ఎన్‌కౌంటర్లలో ఆశలు కూలిపోతున్నా
నెత్తుటి దుప్పటి కప్పుకున్న తెలంగాణా
లోపల కదలాడుతూనే ఉంది
గత వారసత్వాన్ని స్వప్నిస్తూనే ఉంది
మనం తెలంగాణాని స్వప్నించాలి

కలగనడం నేరం కాదు
కలల మీద నిఘా వేయడం, ఖైదు చేయడం నేరం
కలల్ని ఎన్‌కౌంటర్ చేయడం నేరం
కలల్ని ధ్వంసం చేయడం నేరం
దగ్ధమైపోతున్న గీతాల నుండి
విధ్వంసమైపోతున్న స్వప్నాల నుండి
మహాస్వప్నం ఉదయిస్తుంది
కొత్త ఉదయాల కోసం నెమళ్ళ నాట్యంలా ....
మనం కలగనాలి

( రచనా కాలం : జనవరి 1992 )

# 'విశ్వ సాహితి' పత్రికకు పంపిన జవాబు

— లూషన్

**మీ రడిగిన ప్రశ్నలు ఇవి :**

1. సోవియట్ యూనియన్ ఉనికి, విజయం పట్ల మీ స్పందన ఏమిటి ? (మీ ఆలోచనా విధానంలో, మీ రచనా స్వభావంలో అక్టోబర్ విప్లవం ఏయే మార్పులు తెచ్చింది ?)
2. సోవియట్ సాహిత్యంపై మీ అభిప్రాయం ఏమిటి ?
3. పెట్టుబడిదారీ దేశాలలోని ఏయే సంఘటనలు, సాంస్కృతిక ధోరణులు మిమ్మలను ఎక్కువగా ఆకర్షించాయి ?

**ఈ ప్రశ్నలకు మా జవాబులు :**

1. పాత సమాజపు కుళ్ళు గురించి నాకు తెలుసు. నూతన సమాజావిర్భావానికి ఎదురు చూస్తూ వున్నాను. ఈ 'నూతన' సమాజం రూపం ఎలా వుంటుందో నాకు తెలియదు. ఈ 'నూతన' సమాజంలో అంతా బాగా వుంటుందన్న పూర్తి విశ్వాసమూ నాకు లేదు. అక్టోబరు విప్లవం విజయవంతమయ్యే వరకూ, ఈ నూతన సమాజానికి సృష్టికర్త శ్రామికవర్గం అన్న సంగతి నాకు తెలియదు. పెట్టుబడిదారీ దేశాల వ్యతిరేక ప్రచారానికి లోనై, అక్టోబర్ విప్లవం గురించి నేను అంతగా పట్టించుకోక పోగా కొన్ని సందేహాలు కలిగి వున్నాను. కాని ఇప్పుడు సోవియట్ యూనియన్ ఉనికి, విజయమూ చూసి, వర్గ రహిత సమాజం తప్పనిసరిగా ఏర్పడుతుందన్న నమ్మకం కల్గింది. నాకున్న అనుమానాలన్నీ పటాపంచలై పోయాయి. నాలో వున్న ధైర్యం ఇనుమడించింది. ఇక నా రచనలంటారా ! నేను విప్లవ ప్రభంజనానికి బయట వున్నాను కనుక, చాలా కాలంగా ప్రయాణం చేయలేక పోవడం వల్ల, ఏం జరుగుతుందో చూడక పోవడం వల్ల, పాత సమాజపు రుగ్మతలను నా రచనల్లో బట్ట బయలు చేయ గల్గుతున్నాను.
2. సోవియట్ సాహిత్యాన్ని జర్మన్, జపనీస్ అనువాదాల ద్వారా మాత్రమే నేను చదవ గల్గాను. ఈనాడు సోవియట్ నిర్మాణానికి సంబంధించి వస్తున్న నవలలు కాకుండా, పోరాటానికి సంబంధించిన తొలి నవలలు — ది ఆర్మర్డ్ ట్రైన్, ది నైట్టీన్, ది ఐరన్ ఫ్లడ్ మొదలగునవి నాకు బాగా నచ్చాయి - ఉపయోగ పడ్డాయి. సోవియట్ సాహిత్యం చదవడంలో నా ప్రధాన ఉద్దేశం ఏమిటంటే - దాన్ని నేను చైనాకు పరిచయం చేయాలనుకుంటున్నాను. ఈనాటి చైనాకు పోరాటానికి సంబంధించిన రచనలు చాలా అవసరం. →

## స్వీకారం :

1. పరాధీన భారతం (ప్రభుత్వ నూతన ఆర్థిక విధానాల విశ్లేషణ) - ఏ. బి. కె, పేజీలు 216, వెల సాధారణ ప్రతి : రు. 25/-, లైబ్రరీ ప్రతి రు. 50/-, ప్రచురణ : పర్‌స్పెక్టివ్స్, హైదరాబాదు.

2. కల్లోల కలల మేఘం (కవితా సంకలనం) నారాయణ స్వామి పేజీలు : 96. వెల రు. 15/- ప్రచురణ : విప్లవ రచయితల సంఘం, సిటీ యూనిట్.

   పై రెండు ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, ఆర్యమందిర్ ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాదు.

3. సారా వ్యాపారాన్ని రద్దుచేసే వరకూ సర్కారుకు పన్నులు కట్టొద్దు! ప్రచురణ : ప్రగతిశీల మహిళా సంఘం, (స్త్రీ విముక్తి), అం. ప్ర. రైతు కూలీ సంఘం, ఐ. యఫ్. టి. యు.

   ప్రతులకు : ఎన్. వి. కృష్ణయ్య. 168, న్యూ ఎం. ఎల్. ఏ. క్వార్టర్స్, బషీర్ బాగ్, హైదరాబాదు

4. ఉపాధ్యాయ (మాస పత్రిక), నవంబరు 92, పేజీలు 32. ప్రచురణ : ఏ. పి. టి. ఎఫ్ ఆఫీసు; సూర్యారావుపేట, విజయవాడ-2.

5. విజృంభణ (మాస పత్రిక) నవంబరు 1992, పేజీలు: 34, వెల రు. 3/-, ప్రచురణ : పి. డి. యస్. యు. C/o. టి. సంజీవ్, రూమ్ నెం. 12, గోదావరి (ఎ) హౌస్, ఒ. యు. కాంపస్, హైదరాబాదు

6. జన పథం (ప్రజాతంత్ర ఉద్యమ వేదిక) మాస పత్రిక, నవంబరు 92 పేజీలు 20, వెల రు. 2/-.

   ప్రతులకు : చావలి సుధాకర రావు, మరాఠీ పాలెం, ఒంగోలు.

---

→ 3. పెట్టుబడిదారీ దేశాల్లో కనబడే డాంబికమైన 'సంస్కృతి' ఇక్కడ చైనాలో లేదు. నాకు తెలిసినంత వరకు మా దేశంలో వాళ్ళు, వారి తొత్తులూ విద్యుత్ సాధనాలే గాక, యంత్ర శాస్త్రాన్నీ, రసాయన శాస్త్రాన్నీ విప్ల కారులను చిత్రహింసల పాలు చేయడానికి ఉపయోగిస్తున్నారు - మా విప్ల ప్రజారాశులను చంపడానికి విమానాలనూ, బాంబులనూ ఉపయోగిస్తున్నార

(అనువాదం : డా॥ కిరణ్మయి

మార్చి 23, 1934.

# సం'క్షుభిత' సోమాలియా !

— కొత్తపల్లి రవిబాబు

నేటి సోమాలియా పేరు నాటి బెంగాల్
నిన్నటి ఇథియోపియా పేరు మొన్నటి కలహాండి
పేరెదైతేనేం - సర్వత్రా దొక్కల కరువే
పాలకుల నిర్లక్ష్యపు నిదర్శనాలే !
ఇక్కడ బాల్యం వృద్ధాప్యానికి గురైంది
ఇక్కడ పిల్లలు చావుతో పుడుతున్నారు
ఇక్కడ పిల్లలూ, మృత్యువూ కవలలు
అన్నలు తమ్ముళ్ళ శవపేటికల బండ్లను
తోసుకు వెళ్తున్నారు నిర్వేదంగా !
ముసైమో అలీ తన ఏడవ కొడుకుని పూడ్చిపెట్టింది నిన్నో, మొన్నో
అవి సజీవ కంకాళాలు
వారి రక్తమాంసాలు దోపిడీదార్ల బ్యాంకుల్లో
అకౌంట్లుగా మారాయి !
అవి నడుస్తున్న అస్థిపంజరాలు -
ఎండిన చర్మాలూ, ముందుకు చొచ్చుకు వచ్చే కపాలాలూ !
ప్రపంచ నిర్లక్ష్యానికి గురైన సోమాలియా
గత దశాబ్దపు ఇథియోపియాను మరపింప చేస్తోంది
నాలుగు మెతుకుల కోసం
కాళ్ళ నిండా పుండ్లతో / వందలాది మైళ్ళ నడక !
సహాయ శిబిరాల్లో ప్రవేశం కోసం పడిగాపులు !
ఎండిన పిచ్చికంపలా కాళ్ళూచేతులూ వేలాడేసుకుంటూ
కదులుతున్న మృత్యువులా సోమాలియా !
అధికంగా పండిన టమోటాలతో
విచ్చలవిడిగా ఆడుకున్న దోపిడీ ఆర్థికవిధానపు
వికటాట్టహాసమే సోమాలియా !
రోజూ కళ్ళ ముందు వెళ్ళే శవ పేటికలను
కనీసం కన్నెత్తి చూసే ఓపికల్లేవు
గోగు పుల్లల కట్టలా రేపో మాపో తామూ ఆ పేటికల్లోకి
సోలబోయే జీవన్మృతులు —
మృత్యువు ప్రపంచ బ్యాంకు ముసుగేసుకొని

( తరువాయి 54వ పేజీలో )




## సర్కస్ పిట్ట "పురాణం"

9. 11. 92 నాటి 'ఉదయం' దిన పత్రికలో పురాణం సుబ్రహ్మణ్య శర్మ 'సారాంశం' అనే లేఖ రాశారు. వారు దాన్ని ఏ మూడ్‌లో రాసారో తెలీదు గాని, దాని సారాంశం మాత్రం ప్రస్తుతం మన రాష్ట్రంలో సాగుతున్న సారా వ్యతిరేకోద్యమాన్ని నీరస పరచడం - తన కనీస పవిత్ర కర్తవ్యంగా తోస్తోంది. ఆ లేఖని మాక్డొవల్ సి(సా)రాతో రాసినట్టు అనిపిస్తోంది.

"తాగని నాకొడు కెందుకు లోకంలో" అన్నట్టుగా సాహిత్యంలో నోబెల్ బహుమతి గ్రహీతల దగ్గర నుంచి శ్రీశ్రీ తదితరుల దాకా మద్యపాన ప్రియులే గనుక తాగిన వాడే గొప్ప సాహిత్యాన్ని సృష్టించ గలుగుతాడనే సిద్ధాంతాన్ని పరోక్షంగా ప్రతిపాదించాలని పురాణం ప్రయత్నించారు.

సిగరెటు తాగితేనేగాని మంచి ఆలోచనలు రావని చెప్పే కొందరు మిత్రుల్లాగా మద్యపానం చేయకపోతే మంచిరచనను చేయలేమనే వారూ వున్నారు. ఇది తమ తమ బలహీనతలను కప్పిపుచ్చుకోవడానికి వాళ్ళు వేసే చిట్కా తప్ప మరొకటి కాదు. మద్యపానం వల్ల నరాల బలహీనత దశకు శరీరాన్ని తీసుకు వెళ్ళిన వారిది స్వయం కృతాపరాధమేగాని, అది సహజ శరీర తత్వం అది కాదని గ్రహించాలి.

బతికుండగా పురాణం వారికి సన్నిహిత మిత్రుడైన యం. వీ. యల్. (నూజివీడు కళాశాల తెలుగు లెక్చరర్) ఎందుకు అకాల మరణానికి గురయ్యాడో ; మార్క్సిస్టు సాహిత్య విమర్శకుడుగా పేరు ప్రఖ్యాతుల్లోకి వస్తున్న టి. యల్. కాంతారావు ఎందుకు అర్థాంతరంగా చనిపోయాడో పురాణానికి తెలీదా ? ('పురాణం' హిపోక్రసీ మరింత నగ్నంగా అందరూ అర్థం చేసుకోడానికైనా 'చిరాయువు'గా వుండాలని నేను కోరుకుంటున్నాను.)

సారాని నిషేధిస్తే, దొంగ సారా గ్యారంటీగా వస్తుందని పురాణం బల్లగుద్ది వాదిస్తున్నారు. విప్లవ ప్రజాసంఘాలు మద్యపానాన్ని నిషేధించమని కాకుండా పోరాడి సారా వ్యాపారాన్ని మొత్తంగా రద్దు చేయమని కోరడం వెనుక గల కారణం ఇదే. ప్రభుత్వం తానుగా సారా వ్యాపారం చేయడానికి వీల్లేదనీ, సారా ఎవరికి అందుబాటులోకి వచ్చినా దాన్ని అరికట్ట లేకపోయినందుకు ప్రభుత్వమే బాధ్యత వహించాలని పై సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి.

ప్రభుత్వాన్ని నిజాయితీగా వుండమని బోధించి సారాని ఎవరు ఉత్పత్తి చేసినా వారిపై చర్య తీసుకొనే చొరవనీ, చైతన్యాన్నీ పెంపొందించుకోమని ప్రజలకు బోధ చేసి వుంటే పురాణం వారిని ప్రశంసించవచ్చు. కానీ ఆయనకు లక్షలాది కుటుంబాలు సారా వల్ల ఎంత అధోగతి పాలవుతున్నాయో కించిత్ సానుభూతైనా లేదు గదా!

సారా అనేది అనాదిగా వున్నదీ, ఇంద్రుడూ చంద్రుడూ కూడా తాగారంటూ పురాణం విప్పిన పెద్ద మనిషికి, శుక్రాచార్యుడు ఏం చెప్పేడో కూడా గుర్తులేదా? మద్య పాన వ్యసనం నుంచి బయట పడిన శుక్రుడు "ఈనాటి నుండి మద్యపానాన్ని నిషే ధిస్తున్నాను. ఎవడయితే మద్యం సేవిస్తాడో, వాడు వివేక హీనుడవుతాడు. పాపంలో పడి పోతాడు. మద్యపానం మంచిది కాదు. మద్యం తాగిన వాణ్ని అంతా చులక నగా చూస్తారు. అవమానిస్తారు. ఇప్పటి నుండి మద్యం తాగిన వాళ్ళు ధర్మం తప్పి నట్టే" అని శాసించాడని "మహా భారతం"లో వున్నట్టు పురాణానికి తెలీదా ?

ప్రజల చైతన్యాన్ని మొద్దు పరచడానికి, కోట్లాది రూపాయలు కొద్ది మంది అర్జించడానికి, ఎన్నికల్లో ఓట్లు సంపాదించుకొనే సాధనంగా వాడటానికి, అనేక సంఘ వ్యతిరేక కార్యకలాపాలు చేయడానికీ, అమానుషంగా ప్రవర్తించడానికీ, పాలక పార్టీలూ వర్గాలూ తమ స్వార్థానికి సారాని వాడు కుంటున్నాయి.

సారా తమ గ్రామాల్లోకీ, కుటుంబాల్లోకీ రావడానికి వీల్లేదని పోరాడుతున్నం దుకే ప్రజలపై ఎన్నో దాడులూ, కేసులూ, బెదిరింపులూ వస్తున్నాయి. తమపై అణచివేతకి వ్యతిరేకంగా మహిళల్లో ఒక చొరవ, చైతన్యం, సంఘటిత శక్తి పెల్ల విరుస్తోంది. దీన్ని ఆహ్వానించడానికి, ప్రభుత్వ దోపిడీ వర్గాల దుర్మార్గాన్ని ఖండించ డానికి పురాణం లాంటి వారు నిలబడి వుంటే సంతసించే వాళ్ళమే. కానీ ఆమధ్యన అశ్లీలతా సంస్కృతికి వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమాన్ని కూడా ఈయన వెక్కి రించారు. నేడు సురాభాండాన్ని నెత్తికెత్తుకున్నారు. కుతుర్కాలతో, పాలకుల వాదాలను బలపరుస్తూ రాయడం, ప్రగతిశీల ఉద్యమాలను వెక్కిరించడం ఆయనలో మూర్తీభవించిన ప్రజా వ్యతిరేక స్వభావానికే నిదర్శనం. దీన్ని సాటి రచయితల ఖండించడం ఎంతయినా అవసరం.

వుయ్యూరు — దివి కుమార్

అధ్యక్షుడు, అరుణోదయ

( 54 వ పేజీ తరువాయి )

షరతుల యమపాశాలు విసురుతూ
రేపటి భారతాన్ని మరో సోమాలియాగా ....
మూడో ప్రపంచాన్ని కబళిస్తున్న
సామ్రాజ్యవాదంపై ప్రజలు మూడో కన్ను తెరుస్తారు.
తమ జీవితాలపై తామే ఆధిపత్యం వహిస్తారు.

# సింధూర సాక్షిగా..

-చెరుకు సుధాకర్

నొాదటి సింధూరం మాయమయి నప్పుడు
ఉదయనేత్రం గాయమయి నప్పుడు
మనిషికి గాత్రముందని, నేత్రముందని
ఎదురు తిరిగే దేహముందని
నడక నేర్చి, గడపదాటి
గగన కుసుమం కాని "సత్యం" ఆగమనం కోసం
సత్యం మాయం చేయబడ్డ దృశ్యం నిక్షిప్తం చేసిన ప్రింట్లన్నీ
నీవు దడికట్టి నిలిపినా—
పోల్చుకున్న ఏ సత్యమూ,
మలుచుకున్న ఏ దృశ్యమూ,
విశ్వసనీయం కాదంటారు వాళ్ళు.

సింధూరా !
ఇక్కడ ఎవరికీ కళ్ళు లేవమ్మా!
'మర్యాద'గా ఆ రెండు కళ్ళు అప్పజెప్పి
అంధ సమూహ "ప్రధాన ప్రవాహం"లో కలువమంటే
రైలుపెట్టె, స్టేషనేం ఖర్మ
దేశం దేశమంతా పోటీపడి షరీకయిందమ్మా!
ఇక్కడ రక్షక భట సహాయానికి చాలా మూల్యం చెల్లించాలి.
నల్లకోటు నిజనిర్ధారణ శల్యపరీక్షకు
బోఫార్సులు, భోపాల్లు, అలీసమ్మలు, రమేజాబీలు, అనిల సాక్షులు
ఒకటేమిటి, ఒకరేమిటీ... ఏదీ, ఎవరూ నిలువలేరమ్మా!

భయాగ్రస్థ మంచుగడ్డ మౌనం గోడల్ని ఢీకొని
నీరయి నిశ్చేష్టమై, హాజర్ కాని సాక్ష్యం కాక
మహజరయి, మానవ హక్కుల సంఘమయి,
ఎడతెగని దుఃఖమయి ధర్మాసనం బోన్లో ప్రవహించినా
ఏ "అంకురం" మొలకెత్తదమ్మా!
రాజ్యాంగం చెదలు పట్టి దుష్టాంగం బలిసిపోయిన
దూసర క్షేత్రం ఈ వ్యవస్థ
బ్రతికుంటే బలుసాకు చీద

జడత్వం అంతర్లీన జాఢ్యమయిన జాడ
ఒక బీజం భూజమవ్వకుండా తినేస్తుందిక్కడ
చింతపల్లిలో దగ్ధం చేసిన సవరల గుడిసెల బూడిద
ఇప్పుడు సరిహద్దు దళాల పహారాలో
తెలంగాణ అంతటా "పౌర సరఫరా" అవుతున్నది
పౌర హక్కులతో "మిత్రత్వం" నెరిపినందుకు
పసిపిల్లల రామనాథమొక్కడేనా ?
నర్రా ప్రభాకర్ లేడూ! - గులాం రసూల్ లేడూ!!

గురిపెట్టబడ్డ రాజ్యహింస తుపాకీ బయోనెట్ ముందు
పురి విప్పిన స్వేచ్ఛా కంఠాలెన్ని లేవు ! ? ?
నిర్బంధం బొగ్గుపులుసు వాయువు
సకల ఉత్తేజ ఆమ్లజనిని మింగేసిన నిర్జీవ జీవన సంధ్యలో
సాంద్రతర సాహస మొక్కటే
కొడి గట్టిన దీపమై ప్రభాతాలు పూస్తున్నది.
కేశవపల్లో, కాచినపల్లో
పోల్చుకోవడానికి గాయపడ్డ హృదయ మొక్కటి చాలు

సింధూర !
మనిషి ఇజం మరిచిన రాక్షసిజం
మనిషి సోయి మరిచిన కసాయి పాలన
పచ్చని పొలాల మీద, గడ్డి పూల మీద ఎల్లెడలా
ఆయుధ గిడ్డంగుల ఉక్కుపాతర విస్తరించిన
ఖాకీవనంలో "అంకురార్పణ" పరివర్తనా ! ? ?
సెన్సార్ కత్తెరగాట్లకు భయపడి గాని
ఎన్‌కౌంటర్ సెన్సెస్ తెలిసిన వాళ్ళెవరూ నమ్మరు.
సెన్సెస్ సెంటర్‌లో ఉన్న వాళ్ళెవరూ నమ్మరు!

విరామమెరుగని నీ ఆక్రోశం వెండితెరపై
"విరామం" వరకే కుదించినా
నిత్యచలన ప్రజోద్యమ ప్రవాహ చిత్రంపై
సత్య సింధూరంగా నిలబెడతాం

( 'అంకురం' సినిమాకి స్పందిస్తూ )




## తనెవరో తెలియదు

"మీ అందరూ కథలు చదవాలి" అన్నా నా మాటలను కొంత మంది తల్లి దండ్రులు అంగీకరించారు. బాలల కోసం మంచి పుస్తకాలూ, మంచి సినిమాలూ రావాలని కూడా వారు అంటున్నారు. బాలల కోసం పెద్దవారు రాసే పుస్తకాలు మాత్రమే కాక పిల్లలే మంచి మంచి పుస్తకాలు రాస్తున్నారు. అలాంటి వార్తలు పత్రికల్లో వస్తున్నాయి. 'అందుకే మీరందరూ కూడా కళల పట్లా, రాయటం పట్లా అసక్తిని పెంచుకోవాలి, 'గుంటూరు'కు చెందిన ఓ పిల్లవాడు రాసిన లేదా గీచిన ఓ రచన గురించి ఈసారి చెప్పబోతున్నాను. అతని పేరు నాకు తెలియదు. ఓ మిత్రుడు తను ఎవరి నుండో విని నాకు చెప్పిన కథ ఇది. ఆ పిల్లవాడు ఇప్పటికి పెద్దవాడయి ఉంటాడు. తను రచనలు చేస్తున్నాడో లేదో తెలియదు. ఆ పిల్లవాడిని ప్రోత్సహించి ఉంటే ఎంత గొప్ప రచనలు చేసేవాడో కదా- అనిపిస్తుంది. మీ నుండి కూడా అలాంటి రచనలను 'పిల్లల ప్రపంచం' ఆహ్వానిస్తోంది. ఎదురు చూస్తూ.

—అంకుల్

## అతని రచన

బహుశా ఇది రెండు బొమ్మల కథ అయి ఉంటుంది. మొదటి బొమ్మలో మారాం చేస్తున్న ఓ పిల్లవాడు. చేతిలో అన్నం గిన్నెతో బతిమాలుతున్న అమ్మ. ఇంక రెండవ చిత్రంలో గడప మీద దీనంగా కూర్చున్న అమ్మ .... ఆమె ఎదురుగా కొడుకు ఫోటో. తను ఇలా అనుకుంటోంది.

"అప్పుడు అన్నం తినకుండా ఏడిపించావ్"

ఇప్పుడు అన్నం పెట్టకుండా ఏడిపిస్తున్నావ్"

ఇంతే. నాకీ రచన గురించి తెలిసినపుడు కళ్ళవెంట నీళ్ళొచ్చాయి.

## ఆ చిత్రాన్ని మీరు గీయగలరా ?

పైన ఆ బొమ్మల గురించి చెప్పాను కదా. మన పిల్లల్లో ఎవరైనా ఆ బొమ్మల్ని గీసి పంపిస్తే ప్రచురిస్తాం. ప్రయత్నం చేయండి. →

నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎన్. బిల్డింగ్స్, ఎన్. ఆర్. పేట, ఏలూరు.

# గబ్బిలాయి

→ పూర్వం ఓసారి జంతువులకీ, పక్షులకీ, గొప్ప యుద్ధం జరిగింది. గబ్బిలాయి ఎటూ చేరకుండా ఎవరిది పై చేయిగా ఉంటే వాటితో చేరదాం అనుకుంది.

మొదట్లో పక్షులది పై చేయిగా కనిపించింది. వెంటనే గబ్బిలాయి వాటితో చేరి నేనూ పక్షినే అంటూ ఎగిరింది. అంతలోనే జంతువులది పై చెయ్యి అవుతున్నట్లు కనిపించింది. గబ్బిలాయి వాటి దగ్గరకు వెళ్ళింది. వాటికి తన పళ్ళూ, పంజాలూ చూపించి తను జంతువే అనీ, జంతువులంటే తనకు ఇష్టం అని చెప్పింది. చివరికి పక్షులు నెగ్గాయి.

గబ్బిలాయి వాటి దగ్గరికి మళ్ళీ వెళ్ళింది. అవి దాన్ని తరిమేశాయి.

ఇంక జంతువుల దగ్గరికి వెళ్ళలేకపోయింది. అందుకే అది గోడ కంతల్లో చెట్ల బోదెల్లో నివాసం ఉంటుంది. మసక చీకటి పడేటప్పుడే ఎగురుతుంది. అటు పక్షులకీ, ఇటు జంతువులకీ కాకుండా పోయింది.

—టాల్‌స్టాయి తాతగారి 'ఇద్దరు మిత్రులు' నుండి

# గమ్యం కోసం

ఆరడుగులు వేసి అలసి పోవటం కాదు
గమ్యం ముళ్ళ బాటని తెలుసు
నల్లేరుపై నడక కాదు మన ప్రయాణం
ఆశయం ఆరాటం కాకూడదు
చెట్టు నుండి చీలిన కొమ్మ కూడా ఫలాలనిస్తుంది
ప్రవాహం నుండి విడిపోయిన పాయ
ఎక్కడో ఒక చోట కలుస్తుంది
వాలు ప్రవాహంలో కొట్టుకుపోవడంలో కాదు
ఏటికి ఎదురీదటంలోనే జయించ గలుగుతాం
అవిశ్రాంత యానంలో అరమరికలు వద్దు
అందని ఫలాలను అందివ్వటంలోనే మనకు విశ్రాంతి
త్యాగాలు, పోరాటాలు మాత్రమే మనల్ని నిలబెడతాయి
అపుడు మన పొలికేక
ఊళ్ళకు ఊళ్ళనే కదిలిస్తుంది
జన హృదయాల్లో చైతన్యాన్ని రగిలిస్తుంది
మన మెక్కడుంటే అక్కడ
శ్రీకాకుళాలు సిరిసిల్లాలై వెలుగుతాయి

— చిన్ని

## చైతన్య వాహిని

సారా వ్యతిరేకోద్యమంలో అరుణోదయ కళాకారులు రాష్ట్ర వ్యాపితంగా తమ పాటల బృందాలతో విస్తృతంగా నిరంతరంగా పాల్గొంటున్నారు. 'అరుణోదయ' 'జనసాహితి' ప్రచురించిన పాటలతోపాటు ఇంకా అనేక కొత్తపాటలు రూపొందించుకుంటున్నారు.

అరుణోదయ అధ్యక్షుడూ కార్యదర్శులు కలసి రూపొందించిన 'శబ్దం' నాటకాన్ని నెల్లూరు జిల్లాలో సాగుతున్న సారా వ్యతిరేకోద్యమానికి ప్రత్యక్ష మద్దతు నందించటానికి విజయవాడ అరుణోదయ బృందం 20 రోజులపాటు నెల్లూరు జిల్లా అంతా ప్రదర్శించారు. సారా వేలం పాటలు రద్దు చేయించటానికి జరిగిన ఉద్యమంలో అరుణోదయ కళాకారుల బృందం ప్రత్యక్షంగా పాల్గొని "శబ్దం" నాటకం; "అప్పుల భారతం" వీధి భాగవతాన్ని, "వేలం పాటలు" అనే చిన్న నాటకాన్ని ప్రదర్శించి, మరెన్నో ఉత్తేజకరమైన పాటలతో ఉద్యమకారులకు ఉత్సాహాన్నిచ్చారు. 3 రోజులపాటు 28-9-92 నుండి 30-9-92 వరకు వేలంపాటల స్థలంలోనే ప్రజలతోపాటు నిలిచిపోయి పోరాటంలో మమేకమయ్యారు. నెల్లూరు జిల్లాలో 15 రోజుల పర్యటనలో 8 మండలాల్లో 18 సార్లు "శబ్దం" నాటకం ప్రదర్శించారు.

అక్టోబరు 17 నుండి 20 వరకు ప్రకాశంజిల్లా కందుకూరు మండలం పలు కూరులో శిక్షణా శిబిరం నిర్వహించి "శబ్దం" నాటకాన్ని నేర్పారు. ఇప్పటికి ఆ బృందం 20కి పైగా ప్రదర్శనలు యిచ్చి ప్రజలలో మంచి ఆదరణ పొందింది.

ప్రకాశంజిల్లా ఉప్పుగుండూరులో మరొక బృందమూ, కొత్తపట్నంలో వేరొక బృందం 'శబ్దం' నాటకాన్ని నేర్చుకుని విస్తృతంగా అరుణోదయ కళాకారులు ప్రదర్శిస్తున్నారు.

23-10-92న అరుణోదయ'చే రూపొందించ బడిన ఆడియో కేసెట్ - సారా వ్యతిరేక పోరాట పాటలు - విప్లవ రచయితల సంఘం సభ్యులు కా॥ సి. రామమోహన్ ఆవిష్కరించారు. ఆ సభానంతరం 'శబ్దం' నాటక ప్రదర్శన యిచ్చారు. హైదరాబాదులోని S.P. హాలులో జరిగింది. అనేకమంది రచయితలు, కళాకారులు, విమర్శకులు ఆ సభలో పాల్గొన్నారు.

24. 10. 92న రంగారెడ్డిజిల్లా పరిగి గ్రామంలో జరిగిన సారా వ్యతిరేకోద్యమ సభలో అరుణోదయ కళాకారులు సారా వ్యతిరేక పోరాట పాటలు గానం చేసి సభానంతరం 'శబ్దం' వేశారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కా॥ రామారావు, జన సాహితి సంయుక్త కార్యదర్శి కా॥ సురేష్‌లతోపాటు విజయవాడ అరుణోదయ బృందం పాల్గొన్నారు.

★ రాష్ట్రవ్యాపితంగా సారా వ్యతిరేకోద్యమ ప్రాంతీయ సదస్సులను ప్రగతి

ళ్ల మహిళా సంఘం, (స్త్రీ విముక్తి), తదితర విప్లవ ప్రజా సంస్థలు నిర్వహించాయి- ఆ సభల్లో —

1. 27.10.92న విశాఖపట్నంలో జరిగిన సదస్సును 'ప్రజా సాహితి' సంపాదకులు కా॥ నిర్మలానంద ప్రారంభించారు. అరుణోదయ అధ్యక్షుడు కా దివి కుమార్ ప్రసంగించారు. బహిరంగ సభానంతరం స్థానిక అరుణోదయ కళాకారులతో కలసి విజయవాడ బృందం 'శబ్దం' నాటకాన్ని ప్రదర్శించింది.

2. 30వ తేదీన కృష్ణాజిల్లా సారా వ్యతిరేకోద్యమ ప్రదర్శనలో అరుణోదయ కళాకారులు పాల్గొన్నారు. కా॥ రామారావు తదితరులతో కలసి 'శబ్దం' నాటకాన్ని ప్రదర్శించారు.

3. 31.10.92 నాటి నెల్లూరులో దక్షిణ కోస్తాజిల్లాల ప్రాంతీయ సదస్సులో పాల్గొని 'శబ్దం' నాటకాన్ని అరుణోదయ కళాకారులు ప్రదర్శించారు.

4. 2.11.92న కర్నూలు పట్టణంలో జరిగిన రాయలసీమ జిల్లాల ప్రాంతీయ సదస్సులో కా॥ రామారావు, కా॥ సుంకన్నలతోపాటు విజయవాడ అరుణోదయ బృందం పాల్గొని 'శబ్దం' ప్రదర్శించారు.

5. 4.11.92న వరంగల్‌లో దక్షిణ తెలంగాణా జిల్లాల్లో నల్గొండ, వరంగల్ జిల్లాల అరుణోదయ కళాకారులు అనేక కొత్త పాటలు పరిచయం చేశారు. పోలీసు నిర్బంధం కారణంగా 'శబ్దం' నాటక ప్రదర్శన యివ్వలేక పోయారు.

★ 6.11.92న కర్నూలు జిల్లా 'బొల్లవరం' గ్రామంలో జరిగిన మృత వీరుల సంస్మరణ సభలో అరుణోదయ ఉపాధ్యక్షుడు కా॥ సుంకన్న, ప్రధాన కార్యదర్శి కా॥ రామారావు, కార్యదర్శి ఉదయ్ పాల్గొన్నారు. సభానంతరం విప్లవకారుల ఐక్యతావాంఛను ప్రకటించే 'ఎత్తిన జెండా దించకోయ్' అనే నిశ్చలన దృశ్య రూపకాన్ని ప్రదర్శించారు.

## మ న వి

'శబ్దం' వీధి నాటకం పుస్తకం రూపంలో వెలువడటంవల్ల అక్టోబరు 92 తరువాత భాగాన్ని ఈ సంచికలో ప్రచురించటంలేదని పాఠకులు గమనించ ప్రార్థన. అరుణోదయం సంస్థ పుస్తకంగా ప్రచురించింది. వెల రు. 5-00. కాపీలకు - మైత్రి బుక్ హౌస్, మసీదు సందు, కారల్ మార్క్స్ వీధి, విజయవాడ, లేదా అరుణోదయ రామారావు, C/o 168, న్యూ ఎం.ఎల్.ఏ. క్వార్టర్సు, బషీర్ బాగ్, హైదరాబాద్ కి [illegible] సం॥

వెలువడింది ! జన సాహితి ప్రచురణ

**సారా వ్యతిరేక పోరాట పాటలు**

వెల : రు. 2-00

ప్రతులకు :

మైత్రి బుక్ హౌస్, మసీదు వీధి

విజయవాడ - 2.

పోరు పెట్టే బాధలు మర్సేతందుకు తాగుతం
నువ్వొద్దనే
సార ఇసమసుంటిది
సార తాగినందుకు మా కొంపలు సత్తెనాసమైతున్నాయి
తాగి తాగి మా పెయ్యి అబుకు పిప్ప లెక్కైతున్నది—
మేం తాగి మా పెండ్లాం పోరగాండ్లను గోస పుచ్చుకోని
బక్కీస్తున్నం—
సార పీనుగెల్ల
మా పజీత్ చేస్తంది మా ఇజ్జత్ తీస్తంది
మమ్మల్ని బొక్కలైన వాకిట్లీయగ జేస్తంది.

2

మాకు సార బంద్ చేయాలనే వున్నది
మా పానాన్ని చెదపుర్గులెక్క కొరికే సారను
తాగబుద్దైత లేదు
కని ఈ గొడ్డుసాకిరి ఎట్ల తప్పాలె
ఈ బాంచె బతుకు ఎన్నడు పోవాలె
పేర జర గట్టిగ మాట్లాడితె మా కడుపులు కొట్టెపాపిష్టోల్ల
ఎట్ల నాశనం గావాలె ?
మేం గరీబోల్లమే
మేం సార బందుపెడ్తం
సర్కారోల్లు సారపాటలు బందుపెడ్తం
మేం తాగుడు బంద్ జేస్తం
మా ఇమానంగ బత్కనిస్తర
ఇన్నిదినాలు మాదగ్గర గుంజుకున్న సారపైసలు
మాకోసం కర్చుజేస్తర?
మా సెమటదాగి బలిసిన సారదొరలను వంగబెడ్తర ?

3

లేదు
మేం తాగమంటె అన్నలకు అన్నం పెడ్తుండ్రని లోపలేస్తరు
మేం సార ముట్టమంటె
బల్మీటికి మానోల్లుతెర్సి లాఠీల్తోటి పోస్తరు

(మిగతా 37వ పేజీలో)

